# మహోదయం



సంపాదకుడు

తంగిరాల సుబ్బారావు

30



డా॥ ఎల్. బి. శంకరరావు – ధర్మపత్ని శ్రీమతి సుజాతతో
సన్మాన సభ, 5-9-1999, చెన్నై.

బెంగుళూరు మల్లేశ్వరంలో 11వ అడ్డరోడ్డులో వేంచేసియున్న
శ్రీశ్రీశ్రీ వేణుగోపాలస్వామి వారి పాదపద్మములకు సమర్పింపబడిన ప్రతి.

[illegible]
17-2-2000

# చైతన్యకవిత

గంటకు నూఱు పద్యము
లఖండిత వీర మహాశుధారతో
గొంటుదనమ్ము లేక
రసికుల్ తలలూపఁగఁ బల్క,
బంగరుం గంటలు గట్టి మెచ్చిరి
ప్రకాండులు పండితు లాంధ్రభూమి,
నే గుంటురివాఁడ, సత్కవులకున్
గడు నచ్చినవాఁడ నెంతయున్!

–'ఆశుకవి కేసరి'
డా॥ ప్రసాదరాయ కులపతి

సంపాదకుడు
ఆచార్య తెంగిరాల వెంకట సుబ్బారావు

# మళ్ళీ ఒక దీపావళి

ఆ మధ్య
మనం సరదాగా
భాషారాష్ట్ర సమస్యలతో
పంచవర్ష ప్రణాళికలతో
పంచశీల సూత్రాలతో
అందరం బాగుపడాలని
అనుకుంటూ - ఆడుకుంటూ -
దేశదేశాల మైత్రీదీపాన్ని వెలిగించి
నా దేశ సౌభాగ్యాన్ని ఆకాంక్షించి
చరిత్ర ఎండినగొంతులో
శాంతిసుధను చిందాలని
ఒకరి జోలికి పోక
ఒదిగి ఒదిగి మనం ఉంటూంటే
అంతవరకూ మనవాడు మనవాడనుకుంటూన్నవాడు
ఆరేళ్ళక్రితం సరిహద్దులు దాటినా హద్దులు మీరడనుకున్నవాడు
అన్నయ్యలాంటివాడు
అమాంతం కన్నం వేసి చూరుకి నిప్పంటించి
సొంతం నాదేనని మీదికొచ్చేసరికి
చటుక్కున వాస్తవిక జగత్తులోకి జారిపడ్డాం
ఆసేతు శీతనగ మధ్య ధరిత్రి కంపించింది
అశేష ప్రజా పారావార ముప్పెత్తుగా లేచింది
అకుంఠిత శౌర్య సాహసాధ్యాయం మొదలయింది

ఇదీ ఒక మంచికే వచ్చింది
యుద్ధం జాతిని సన్నద్ధం చేస్తుంది
యుద్ధం వైవిధ్యంలోంచి  ఏకత్వాన్ని ప్రాదుర్భవింప జేస్తుంది
యుద్ధం మనని సముదగ్ర జామదగ్న్యుల్ని చేస్తుంది
సజ్యకార్ముకాశ్లిష్ట భుజాబలోద్బుద్ధ పార్థుల్ని చేస్తుంది
చండికా చాముండికా సమ ప్రతాపోద్దీపితోద్దండ
మండితాఖండ నారీమండలం మనకి అండగా నిలుస్తుంది
శత్రు సమూహ సంహార సమర్థుల్ని చేస్తుంది
రుద్రుల్ని ద్వాదశాదిత్యుల్ని చేస్తుంది
సర్వభారతం ఒక్కటీనాడు
సర్వపక్షముల కొక్క చక్షు వీనాడు
శతకోటి హస్తములు ఒక్కటిగ నొక్కిన చప్పటులు నేడు
సమర ఖర్జూ సింహగర్జాభీల నాదమే దెసదెసల మ్రోగు
ఇంక భయం లేదు
జాతి సత్యాన్ని గుర్తుంచుకుంది
తన అస్తిత్వ సత్యాన్ని గ్రహించుకుంది
వందలాది సంవత్సరాల మగతలోంచి మాయలోంచి
జడిమలోంచి జబ్బులోంచి కోలుకుంది
బలం పుంజుకుంది.

ప్రాచీనమైన ఆత్మ పునరున్మిషితమైంది
సాచీకృత శివధనుస్సు సత్యాకృతి నిల్చి శబ్దించింది
ధైర్యంగా నిలబడింది
దృఢంగా కలబడింది
ముందుకు ముందుకు నడిచింది

మొనగాళ్ళ మనిపించుకుంది
హుటాహుటిగ నడుస్తుంది
హిమాలయం దాటుతుంది
మన ప్రధాని శ్రీకృష్ణుడు
ప్రజాశక్తి సత్యభామ
మన పతాక హిమగిరిపై మళ్ళీ ఆడుతుంది
మళ్ళీ ఒక దీపావళి
క్రొత్త క్రొత్త దీపావళి
శాంతి సౌఖ్య తారావళి -
గళగళాన గళన్మధు
మందార సుమ హారావళి
భారత జనయిత్రీ పద
పూజా నవగీతావళి
మనకే కాదు-
మహీవలయ సమస్తానికి
మహదాశయ జీవన
విధాన మహస్సీమకి -

– కీ.శే. దేవరకొండ బాలగంగాధరతిలక్

(''వాణి'' అనే రేడియో పత్రిక సౌజన్యంతో 23-12-1962నాడు రాజమండ్రి నుండి వెలువడే ''సమాచారం'' అనే దినపత్రికలో ముద్రింపబడిన కవిత. ఇది విశాలాంధ్ర వారు ప్రచురించిన 'అమృతం కురిసిన రాత్రి' కవితా సంపుటిలో చేరలేదు. 1962లో జరిగిన చైనా దురాక్రమణను దృష్టిలో పెట్టుకుని వ్రాసిన కవిత. సేకరణ: డా॥ ద్వా.నా. శాస్త్రి)

# చైతన్య కవిత

**30**

ప్రమాథి శరత్తు
October 1999

సంపాదకుడు

ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

సహాయకులు

డా॥ రాజేశ్వరీ దివాకర్ల
శ్రీమతి అంబికా అనంత్
శ్రీవాసు

చైతన్య కవితా వేదిక
40/12-7 ''సౌరభ'' (మేడపైన)
22వ క్రాసు, గోవిందరాజ నగర, విజయ నగర
బెంగుళూరు - 560 040

**CHAITANYA KAVITA,** a journal devoted to Modern Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, October - 1999.

Pp. xxii + 138

ముఖచిత్రం : 'అవధాని శేఖర', 'ఆశుకవి కేసరి',
'సరస్వతీ కంఠాభరణ', 'రూపక సమ్రాట్'
డాక్టర్ ప్రసాదరాయ కులపతిగారు, గుంటూరు

అట్టవెనుక : హైదరాబాదులోని జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్‌లో కేంద్ర సాహిత్య అకాడమీ ఫెలోషిప్ స్వీకరిస్తున్న 'యుగకవి', 'నవ కవితా పితామహ' డా॥ గుంటూరు శేషేంద్ర శర్మగారు.

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి నరసింహారెడ్డి
కళాప్రపూర్ణ శ్రీ 'బాపు'

| | | | |
|---|---|---|---|
| వెల | : విడిప్రతి | : | రూ. 20-00 |
| | జీవిత సభ్యత్వం | : | రూ. 500-00 |
| | పోషక సభ్యత్వం | : | రూ. 1000-00 / $100 |
| ప్రకటనలు | : రెండవ కవరు | : | రూ. 3000-00 |
| | మూడవ కవరు | : | రూ. 2000-00 |
| | పూర్తి పుట | : | రూ. 1000-00 |

**For Copies** : **Prof. T.V. Subba Rao** M.A., Ph.D.
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Corss, Govnidarajanagar,
Vijayanagar, Bangalore - 560 040
Ph. 080-3305902

**M/s. Visalaandhra Book House**
4-1-435, Bank street, Hyderabad - 500 001
and all its Branches

**DTP By** : **Sree Laxmi Laser Graphics**

**Printed By** : **Sree Laxmi Art Printers**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Ph:3300093.

# అంకితం

నా

యౌవనకాల ప్రియమిత్రుడు

సహోదర తుల్యుడు

ఆచార్య లింగంనేని బసవశంకరరావుకు

నాలాగే వృద్ధాప్యంలోకి

అడుగుపెడుతున్న శుభసందర్భంలో

నలభైయేళ్ళ చెలిమికి

ఒక తీపిగుర్తుగా

ఈ

'చైతన్య కవిత'

– తంగిరాల వెంకటసుబ్బారావు

# జోతలు

-'మహా సహస్రావధాని' డా॥ మేడసాని మోహన్

క. కమనీయ బోధనాంచిత
సముజ్జ్వలత్ వాక్ప్రవాహ సంభరితుఁడు, లిం
గమనేని బసవశంకర
సుమతికి, సద్గురువరునకు జోతలు వేవేల్.

క. భాషా వాఙ్మయరీతులు
భూషిత సాహిత్యతత్త్వ ముఖ్యాంశమ్ముల్
పోషించుటలో సమ సం
తోష స్వీకృతికి, సద్గుణునకున్ వినతుల్.

క. ఆచార్యోత్తముఁడయ్యును
ప్రాచుర్య స్నేహశీల బంధురుఁ డై, వి
ద్యా చైత్రుల మన్నించెడి
ధీ చూడామణిని, సన్నుతించెద మిగులన్.

*(5-9-1999 ఉపాధ్యాయ దినంనాడు మద్రాసులో ఆచార్య లింగంనేని బసవశంకరరావు గారికి వారి శిష్యులు, మిత్రులు కలిసి చేసిన సన్మాన సభలో చదివిన కవిత).*

# శరత్తారలు

# మనవి

## 1

'చైతన్య కవిత' కేవలం కవిత్వానికే అంకితమైన పత్రిక. ''దీంట్లో కవిత్వం తప్ప ఇంకేమీ ఉండకూడదు'' అనే ఉద్దేశంతో దీనిని ప్రారంభించాం. (ఆంగ్లంలో ఇటువంటి కేవల కవిత్వ పత్రికలు కొన్ని వెలువడుతున్నాయి. ఉదాహరణానికి మద్రాసు నుండి డా॥ కృష్ణ శ్రీనివాస్ గారు ప్రకటించే ''పొయిట్'' అనే పత్రిక). అయితే కవుల ముఖచిత్రాలు వేయాలని నిర్ణయించడంతో ఆ కవులను గురించి ఒక పరిచయ వ్యాసం కూడా ప్రచురిస్తే బాగుంటుందని ఆలోచించాం. ఇలాగ ఈ పత్రికలో వచనం ప్రవేశించింది. క్రమక్రమంగా ఈ పరిచయ వ్యాసాలు వందిమాగధస్తోత్రాలుగా మారిపోయి, కొండవీటి చేన్తాడులా పెరిగిపోయాయి. దీంతో భయపడిపోయి పరిచయ వ్యాసాలకు బదులుగా 'బయోడేటాలు' వేస్తే చాలు అనుకున్నాం. కాని ఈ బయోడేటాలు కూడా ఒక్కొక్కటి 10-12 పేజీల వరకూ పంపడం మొదలుపెట్టారు. వీటిని సంగ్రహించి ప్రకటించవచ్చు. అలా చేస్తే ఆయాకవులకు కోపం రావచ్చు. అందువల్ల సాధారణంగా బయోడేటాలు ప్రచురించడం కూడా మానివేశాం. ఫొటో ముద్రించి, 'ఫలానాకవి' అని వ్రాసి ముగిస్తున్నాం.

'చైతన్యకవిత' ఆరుమాసాలకొకసారి వెలువడుతుంది. ఈ ఆరుమాసాలలో వెలువడిన కొన్ని మంచి కవితాసంపుటులను ''నికషోపలం'' లేదా ''గీటురాయి'' అనే పేరుతో దీంట్లో సమీక్షిస్తే బాగుంటుందని ఒక ఆలోచన వచ్చింది. అయితే ఆరుమాసాల వ్యవధిలో 40-50 కవితా సంపుటులు, సంకలనాలు వెలువడుతున్నాయి. పైగా సమీక్షకులు కూడా పెద్ద పెద్ద థీసీస్సులు వ్రాయడం మొదలుపెట్టారు. అందువల్ల సమీక్షకు బదులుగా ''కవితా! ఓ కవితా!'' పేరుతో ఆయా కవితాసంపుటుల పేర్లు, వెల, లభించేచోటు వేయడం మొదలుపెట్టాం. ఈ లిస్టు సమగ్రం కాదని మాకు తెలుసు. మేము ఆంధ్రప్రదేశ్‌కు బయట కర్ణాటక రాష్ట్రంలో ఉన్నాం. తెలుగు పత్రికలన్నీ చూసే అవకాశం లేదు. ఏదో కంటపడిన సంపుటులను పేర్కొంటున్నాం. ''మేము ఫలానా పుస్తకం ప్రకటించాం. ఎందుకు వేయలేదు?'' అని నిలదీస్తున్నారు కొందరు. ''బాబూ! ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న మీరు ప్రచురితాలైన కవితాసంపుటుల లిస్టు చేసిపంపండి. మేము ప్రచురిస్తాం'' అని సమాధానం చెప్పుకున్నాం. ఇక ఈ ''కవితా! ఓ కవితా!'' కూడా

నిలిపివేస్తే మంచిదనే అభిప్రాయానికి వస్తున్నాం. కవిత్వానికి తప్ప ఇంక దేనికీ ప్రాధాన్యం ఇవ్వదలచుకోలేదు. 'సాహిత్యవార్తలు' కూడా అనవసరం అనిపిస్తోంది.

## 2

''చైతన్యకవితలో మంచి కవితలు రావడం లేదు. ఈనాడు ప్రతి పత్రికలోనూ వస్తున్న చెత్త కవిత లాంటివే మీ పత్రికలోనూ వస్తున్నాయి'' అంటున్నారు శిఖామణి వంటి కవిమిత్రులు. అవును. నిజమే. కవితలస్థాయి పెరగటంలేదు. కవితలు బాగా లేవని విమర్శిస్తారేకాని శిఖామణివంటి ప్రసిద్ధకవులు తమకవితల్ని చైతన్యకవితకు పంపరు. (వారు ప్రాథమిక దశలో ఉన్నప్పుడు పంపారు!) . ఒకటీ అరా వ్రాస్తే వాటిని కోటీశ్వరులు నడిపే పెట్టుబడిదారీ పత్రికలకు మాత్రమే పంపుతారు. వారి కవితా వస్తువు మాత్రం విప్లవం, అభ్యుదయం, భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థల నిర్మూలనం! ఈ 'అభ్యుదయ కవులు, తమ కవితలనే కాదు, తాము కన్నపిల్లల్ని కూడా అమెరికాకే పంపుతారు కాని రష్యాకు పంపరు. అమెరికాలో అయితే లక్షలు సంపాదించ వచ్చు; రష్యాలో ఏముంది 'బూడిద' (సారీ 'మంచు')!

'చైతన్యకవిత' లోని కవితల స్థాయిని పెంచడానికి నేనొక ఆలోచన చేశాను. ఆరునెలల కాలంలో వివిధ పత్రికలలో వచ్చిన కవిత లన్నింటినీ పరిశీలించి, వాటిలో ఉత్తమమైనవాటిని ఏరి చైతన్యకవితలో పునర్ముద్రించాలని అనుకున్నాను. శ్రీయుతులు ద్వా.నా.శాస్త్రి, రామసూరి, సౌభాగ్యవంటి మిత్రులకు ఈ ఎంపిక పనిపెట్టాను. వారు కొన్ని కవితలు పంపారు. అయితే ''ఒకసారి ఒక పత్రికలో ముద్రింప బడిన కవితను తిరిగి మన పత్రికలో ముద్రించడం సరికాదు. ఒక సంకలన గ్రంథంగా వేసుకుంటే మా అభ్యంతరం లేదు'' అని మా సహాయ సంపాదకులు (ముఖ్యంగా 'వాసు') తిరుగుబాటు చేశారు. అలాగే ఆంగ్లకవితలు కూడా తెలుగు పత్రికలో వేయడం సరికాదన్నారు. అందువల్ల నేను సందిగ్ధంలో పడ్డాను. అనువాద కవితలు బాగున్నాయని ప్రశంసిస్తున్నారు. అందువల్ల వాటిని మాత్రం కొనసాగిస్తున్నాను.

## 3

'చైతన్యకవిత' స్థాపించి 15 సంవత్సరాలయింది. ప్రారంభంలో ఈ పత్రిక ముద్రణకు 3,4వేలు ఖర్చు చేసేవాడిని. ఇప్పుడు ఒక్కొక్క సంచికకు 20వేల వరకూ ఖర్చు అవుతోంది. పుటలు 80 అనుకుంటే 160 వరకూ పెరిగిపోతున్నాయి. వీటిని అదుపులో పెట్టుకునే ప్రయత్నాలు చేస్తున్నాను. అయినా చాలాసార్లు మొగమోటానికి లొంగిపోయి పేజీలు పెంచివేస్తున్నాను.

మొదట్లో జీవిత సభ్యత్వం 200రూ.లు అనుకున్నాం. పత్రిక ముద్రణ వ్యయం ఇబ్బడిగా ముబ్బడిగా కాదు, ఆరురెట్లు పెరిగిపోవడంతో, 200రూపాయలకు జీవితాంతంవరకూ పత్రిక పంపడం అసాధ్యమని తేలింది. అందువల్ల జీవిత సభ్యత్వాన్ని 200రూపాయలనుండి 500రూపాయలకు పెంచాం. కాబట్టి ఇదివరలో 200రూపాయలు కట్టిన మిత్రులంతా మరో 300 రూ.లు కట్టి జీవితసభ్యులు కావలసిందిగా కోరుతున్నాను.

'చైతన్యకవిత'లో ఒక పుట ముద్రించటానికి నాకు 100రూ.ల ఖర్చు అవుతోంది. కాబట్టి తమ కవితలు పంపే కవులు మొదట చైతన్యకవితకు జీవిత సభ్యులుగా కాని, పోషక సభ్యులుగా కాని చేరవలసి వుంటుందని గమనింప ప్రార్థన.

## 4

ఈ 'చైతన్య కవిత' లో ఒక ప్రత్యేక కవితను ముద్రిస్తున్నాము. అది కీ.శే. దేవరకొండ బాలగంగాధర్ తిలక్‌గారు 1962లో జరిగిన చైనా దురాక్రమణను దృష్టిలో ఉంచుకుని రచించిన ''మళ్ళీ ఒక దీపావళి'' అనే కవిత. ఈ కవిత విశాలాంధ్ర వారు ప్రచురించిన ''అమృతం కురిసిన రాత్రి'' అనే కవితా సంపుటిలో చేరలేదు ఇది మొదట ''వాణి'' అనే రేడియోవారి పత్రికలో ప్రచురింపబడింది. అంటే ఇది మొట్టమొదట రేడియోలో ప్రసారం చేయబడి ఉండాలి. తరువాత 'వాణి' లో ముద్రింపబడి ఉండాలి. ఈ 'వాణి' పత్రిక సౌజన్యంతో ఈ కవిత అప్పట్లో గంధం సీతారామాంజనేయులుగారి సంపాదకత్వంలో రాజమండ్రీ నుండి వెలువడుతున్న ''సమాచారమ్'' అనే దినపత్రికలో 23-12-1962నాడు పునర్ముద్రిత మయింది. దీనిని మా అల్లుడుగారైన డా॥ ద్వానా శాస్త్రిగారు సేకరించి భద్రపరిచి ఇటీవల నాకు పంపించారు. వారికి నా ఆశీస్సులు. ఈ కవితను ''అమృతం కురిసిన రాత్రి'' పునర్ముద్రణలో చేర్చవలసిందిగా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజరుగారైన మిత్రులు శ్రీ పి. రాజేశ్వరరావుగారిని కోరుతున్నాను.

## 5

1967 నుండి 1999 వరకూ మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేసిన ఆచార్య లింగంనేని బసవశంకరరావు నాకు 1961నుండీ ప్రాణమిత్రుడు; సోదరతుల్యుడు. ఇద్దరం కలిసి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1961-63 మధ్య తెలుగు ఎం.ఏ. చదివాము. 1963-1967 మధ్య పిహెచ్.డి. పరిశోధన చేశాము. ఇటీవల శంకరరావు రిటైరయిన సందర్భంలో మద్రాసులో అతని శిష్యులు,

మిత్రులు కలిసి 5-9-1999 ఉపాధ్యాయదినంనాడు అతనికి గొప్ప సన్మానం చేశారు. అతనిపై కవితలల్లి చదివారు. ఆ కవితలన్నీ ఈ సంచికలో ఒక అనుబంధంగా ఇచ్చాను. మా నలభై ఏళ్ళ మైత్రికి గుర్తుగా ఈ సంచికను ప్రొ॥ ఎల్.బి. శంకరరావుకు అంకితమిస్తున్నాను.

## 6

ఇటీవల 'యుగకవి' - 'నవకవితా పితామహ' డా॥ గుంటూరు శేషేంద్ర శర్మగారికి కేంద్ర సాహిత్య అకాడెమీ ఫెలోషిప్ ఇచ్చి సత్కరించింది. అమెరికా లోని 'అప్పాజోస్యుల-విష్ణుభొట్ల ఫౌండేషన్' వారు 2000 సంవత్సరానికిగాను ఆల్‌టైమ్ ఎఛీవ్‌మెంట్‌గా 'పఠాభి' (శ్రీ తిక్కవరపు పట్టాభి రామరెడ్డి) గారిని సన్మానించడానికి నిర్ణయించారు. శేషేంద్రగారినీ, పఠాభిగారినీ చైతన్యకవిత అభినందిస్తోంది. వీరిద్దరూ మా చైతన్యకవితా వేదిక గౌరవాధ్యక్షులు అయినందుకు గర్విస్తున్నాం.

## 7

కరీంనగర్ జిల్లా 'సిరిసిల్ల'లో ఉంటున్న ప్రముఖ అభ్యుదయ కవి శ్రీ జూకంటి జగన్నాథంగారు రచించిన 'గంగడోలు' అనే కవితా సంపుటికి ''నూతలపాటి గంగాధరం అవార్డు''(చిత్తూరు) వచ్చింది. హైదరాబాదులో ఉంటున్న ప్రముఖ పద్యకవి శ్రీ వి. యస్. ఎల్. భీమశంకరంగారు రచించిన ''రసస్రువు'' పద్య కావ్యానికి పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో ఉన్న ''శ్రీరామరాజ భూషణ పరిషత్'' వారు ''శ్రీమతి వడ్డి సుజాత-శ్రీవడ్డి శ్యామసుందరరావు కావ్య పురస్కారం'' ఇచ్చారు. చిత్తూరు జిల్లా మదనపల్లెలో ఉన్న డా॥ మల్లెల గురవయ్య అనే ప్రముఖ పద్యకవి రచించిన ''శ్రీ సీతారామరాజీయము'' అనే వీరమహాకావ్యానికి మూడు అవార్డులు వచ్చాయి. ''మహాకవి గడియారం శేషశాస్త్రి అవార్డు'' (కడప) - ''కవిప్రభా అవార్డు'' (మచిలీపట్నం) - ''కుప్పం రెడ్డమ్మ సాహితీ అవార్డు'' (చిత్తూరు). కన్నడాంధ్రాలలో ప్రముఖ రచయిత, ప్రసిద్ధ మానవతావాది, ములకనాటి 'సాతవల్లి' రసవత్ కవి పండిత వంశానికి చెందిన శ్రీ ''హరిహరప్రియ'' (శ్రీసాతవల్లి వేంకటవిశ్వనాథ) కు ఈ సంవత్సరం కర్ణాటక ప్రభుత్వం ''రాజ్యోత్సవ అవార్డు'' ఇచ్చి సత్కరించింది. ఈయన చిన్న వయసులోనే పెద్ద అవార్డును పొందడం కన్నడిగులు ఆంధ్రులు గర్వించదగ్గ విషయం. ఈ కవులందరినీ చైతన్యకవిత అభినందిస్తోంది.

'సౌరభ' - బెంగుళూరు — తంగిరాల

7-11-1999 (దీపావళి)

# డాక్టర్ ప్రసాదరాయ కులపతి
## (జీవన రేఖలు)

జననం : 23-1-1937, ప్రకాశం జిల్లా - ఏల్చూరు

తల్లిదండ్రులు : కీ.శే. స్వరాజ్యలక్ష్మి, పురుషోత్తమరావు

విద్య : శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము - M.A., Ph.D.

వృత్తి : ప్రిన్సిపాల్, హిందూ కాలేజి, గుంటూరు (రిటైర్డు)

రచనలు : రసవాహిని, ఆనందయోగిని, అమెరికా అనుభవలహరి, గంధర్వ గీతి మొ॥ పద్యకావ్యాలు; శివసాహస్రి, ఇంద్రీ సాహస్రి, అంబికా సాహస్రి మొ॥ స్తుతికావ్యాలు; రమణీ ప్రియదూతిక, వందేమాతరం, ఛిన్నమస్త మొ॥ నవలలు; కవిబ్రహ్మ, కావ్యకంఠ మొ॥ నాటకాలు; ఆంధ్ర భాగవత విమర్శ (పిహెచ్.డి. థీసిస్), తాంత్రిక ప్రపంచం (మంత్రశాస్త్ర వ్యాసావళి), దైవశక్తి, కవితా మహేంద్రజాలం మొ॥ పరిశోధన గ్రంథాలు; వందలకొలది పత్రికా రచనలు, రేడియో, టి.వి. ప్రసంగాలు.

బిరుదులు : మహాకవి, మంత్రశాస్త్ర కళానిధి, అవధాని శేఖర, ఆశుకవి కేసరి, సాహితీ సార్వభౌమ, సరస్వతీ కంఠాభరణ, రూపక సమ్రాట్, కవిమల్ల, కవితా సుధాకర మొ॥

ప్రదర్శనలు : అవధానాలు, ఆశుకవితలు, భువనవిజయ - ఇంద్ర సభాది సాహితీ రూపకాలు, భారతదేశ ప్రధాన పట్టణాలన్నింటిలో; అమెరికాలో న్యూయార్కు నుండి కాలిఫోర్నియా వరకు ముఖ్యనగరాలలో సారస్వత జైత్రయాత్రలు.

దీక్ష : దేవీపద సమారాధన: ఆర్షధర్మ ప్రచారము.

# అమెరికాలో భువన విజయాలు

డా॥ ప్రసాదరాయ కులపతి

(న్యూయార్కులో జరిగిన తానావారి ప్రపంచ తెలుగు మహాసభలలో డా॥ ప్రసాదరాయ కులపతిగారు తమ మిత్రులతో కలసి సాహితీరూపకమైన భువన విజయాన్ని ప్రదర్శించటం జరిగింది. ఆ తరువాత అమెరికాలోని పిట్స్‌బర్గ్, న్యూజెర్సీ, డెట్రాయిట్, డెన్వర్, చికాగో, శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్ ఏంజలిస్ మొదలైన నగరాలలో ఈ ప్రదర్శనలు జరిగినవి. వీటన్నింటిలో డా. ప్రసాదరాయ కులపతిగారు శ్రీ కృష్ణదేవరాయల పాత్ర ధరించి, తెలుగు సాహిత్యపు వెలుగులను ప్రవాసాంధ్రులకు చూపించటం మాత్రమేకాక, వేయ్యేండ్ల చరిత్ర గలిగిన తెలుగు పద్యప్రభావం కన్నుల కట్టినట్లుగా వీనులవిందుగా అందజేసే ప్రయత్నం రూపుదిద్దుకొంది. దాని అక్షరాకృతులీ పద్యాలు. సభలు జరుగుతున్నప్పుడు - మధ్య మధ్యలో - మొదట, చివర చెప్పిన పద్యాలలో కొన్ని ఇక్కడ ఇస్తున్నాము - తంగిరాల).

స్వాగత మ్మద్భుత సాహిత్య సౌహిత్య
సౌజన్య సౌందర్య సౌరభులకు
స్వాగత మ్మనితర సంగీత సంజాత
మాధుర్య మాధుర్య మాధవులకు
స్వాగత మ్మతిలోక చాతుర్య గాంభీర్య
శేముషీ విభవ విశేషితులకు
స్వాగత మ్మత్యంత సౌమనస్యప్రభా
సామరస్యక్రియా సాధకులకు

భువన విజయ మహాసభాభవన కవన
భవ్య విన్యాసములు చూడ వచ్చియున్న
పండితుల కుజ్వల ద్గుణమండితులకు
స్వాగతమ్ము సమాదర స్వాగతమ్ము. 1

సుతపం బీశుడు సల్ప విష్ణుడు దయం జూపించి ఉగ్రోజ్వల
వ్రతముల్ మెచ్చి వరంబు లిచ్చి ఘనశూలంబున్ ప్రసాదింప న

ప్రతిమాన ప్రతిభా ప్రభావుడగు మా పంపా విరూపాక్షు డి
చ్చ్యుత మీ కచ్యుత భక్తిభావము మహాశ్శోభా సముజ్జీవమున్ 2

పెద్దన్న కైతలో విరిసిన దిరిసెన
పూలతావులలోని పొలప మెరిగి
తిమ్మన్న పలుకులో తీయతావులు జిమ్ము
పారిజాతమ్ముల సౌరు తెలిసి
మూర్తి కవీంద్రుని మోహన వాక్కులో
విమలగాంధర్వంబు విలువ చూచి
ధూర్జటి పద్యాల దోబూచులాడెడి
భవభావ భవమైన శివము గాంచి

రమ్యగుణ కృష్ణ రామయ రామకృష్ణ
మధ్యవైష్ణవ నామాల మహిమ నెంచి
అష్టదిగ్గజ కవితా విహార విభవ
రాజితుడ నైన కన్నడ ప్రభుడ నేను. 3

ప్రవహించునో నేడు పర్వతాగ్రమునుండి
రంగ దుత్తుంగ తరంగ తతులు
మలయునో యీనాడు మలయాచలమునుండి
మందమంద కుమార మారుతములు
కురియునో యీనాడు సురవాటికలనుండి
పరిమళ భరిత పుష్పవ్రజంబు
కనిపించునో నేడు గగన వీథులనుండి
సమధిక చంచలా సంచయములు

అష్టదిగ్గజ కవు లపరాబ్జభవులు
కవివరేణ్యు లగణ్య వైభవ శరణ్యు
లీసభన్ పద్యముల్ ప్రవహింపజేయ
సంపద మదేభ్యులార ! ఓ సభ్యులార! 4

# అష్టదిగ్గజ కవులపై చెప్పిన పద్యాలు

## అల్లసాని పెద్దన్న

అల్లసానివారి అల్లిక జిగిబిగి
ఈ విశేష మంద రెరిగినదియె
అల్లసానివారి మల్లిక జిగిబిగి
ఆత డొక్క డెరుగు నదియె కైత! 5

కమ్మకస్తురి తావులు ఘుమ్మురనియె
పచ్చకర్పూరపున్ మేలి పరిమళమ్ము
గుప్పుమనె నీదు సుకవితా కోమలాంగి
మనసులోపల పదము పెట్టిన క్షణాన! 6

## నంది తిమ్మన

పారిజాతంపు తావు లింపార పీల్చి
నంది తిమ్మన ముకు తిమ్మనార్యుడయ్యె
ఆ యశః పారిజాతంబు నంద నెగురు
అన్యులో ముక్కు లేని తిమ్మన్నలైరి!

విచ్చిన కన్నె తామరల వెల్లువలై ప్రవహించు పచ్చి గో
ర్వెచ్చని తీయ తేనె లరవిచ్చిన లేత గులాబి పూవులన్
హెచ్చిన కమ్మతావులివి హే కవిలోక మహేంద్ర! నీ కళా
భ్యుచ్చయముల్ మహోర్థ నవమోహనముల్ హృదయాభిషంగముల్. 8

## అయ్యలరాజు రామభద్రుడు

అచ్చమగు వైష్ణవుండవు
మచ్చులు మాయలును లేని మానవుడవు నిన్
మెచ్చనివా డీ సభలో
మచ్చునకున్ కానరాడు మాన్య కవీంద్రా! 9

కారుణ్యోదయ కాంతిరేఖలు కళాకల్యాణముల్ కావ్య కే
ళీరంగమ్ముల రంగవల్లికలు దీర్చెన్ భావ గేహమ్ములన్
వీరోత్తేజము దాల్చి భవ్య కవితావేశంబుతో నిల్చి నీ
వారంభించిన నేటివేళ గుణభద్రా ! రామభద్రాగ్రణీ ! 10

## మాదయగారి మల్లన

అందరికంటె పెద్దన మహాకవియన్న నె మాకు ప్రేమ మా
డెందమునందు వారికి పటిష్ఠ మహోన్నత పీఠ మయ్యునున్
అందరికంటె ముందు కొలువందున జేరి కవిత్వ రీతులన్
జెందిన అందచందములు చెప్పిన చూపిన మిమ్ము మెచ్చెదన్. 11

## ధూర్జటి

నిపుణ రతికి రాణ నెల్లూరి నెరజాణ
నీకు పాఠములను నేర్పె నొక్కొ
నిబిడ బంధగతులు నీ కైతలో తోచె
శ్లోకచంద్ర ! ధూర్జటీ ! కవీంద్ర! 12

పటు గంగాలహరీ పరీత శమశుంభత్ప్రౌఢతాంచత్ కళా
ఘటనా! పాద వినమ్ర భవ్య నరరా డ్గంభీర కోటీర వి
స్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభోజాత! విఖ్యాత ! ధూ
ర్జటి భక్తాగ్రణి ! ధూర్జటీ! నీ పలుకులన్ శ్లాఘింతు నేవేళలన్. 13

## భట్టుమూర్తి

నీ వ్యుత్పత్తి మహాబ్ధి వేలలను అన్వీక్షింపగా లేక యే
వో వ్యాఖ్యానములాచరించెదరుగా కుత్సాహభావోల్లస
న్నవ్యత్వంబున భవ్యభావ్యత వెలుంగన్ దివ్య దీవ్య న్మహా
కావ్యంబుల్ రచియింతువో! గగన గంగా వేగ వేగంబునన్. 14

గాయకులు కొందరుందురు కవుల లోన
గాయకుల లోన కొందరు కవులు గలరు
గాయకుల లోన గాయకాగ్రణివి నీవు
కవుల లోపల మేలైన కవివి నీవు. 15

## పింగళి సూరన

పింగళి వంశము కవితకు
బంగరుగని నేడు నీదు పద్యము చూడన్
శృంగారపు ధుని యయ్యెను
పొంగారుచు ప్రౌఢకాంత పురుషాయితమై! 16

సూరకవి కైత మధుర శృంగార దూత
సూరకవి మాట మిసిమి బంగారు మూట
సూరకవి పల్కు వెన్నెల సొగసు చిల్కు
చూడ తనకు తానే సాటి సూర సుకవి. 17

కోమలగోస్తనీ మధురగోఘృత ధారలు క్రోలినారమో
ప్రేమరసాప్సరః ప్రణయ వీథులలో విహరించినారమో
శ్యామల శాద్వలీస్థలుల చల్లదనంబును పొందినారమో
సోమరసంబు త్రావితిమొ సూరన ! మా కనుభూతి కల్గెడున్. 18

## తెనాలి రామకృష్ణుడు

విష్ణుపదావలంబి సుకవిత్వ పథంబున బోవు భక్తి వ
ర్ధిష్ణుడ వీవు చాతురి వరించిన నవ్యకళా విలాసినీ
జిష్ణుడ వీవు కావ్యగుణ సిద్ధుడ వీవు రసప్రపంచ వ
ర్తిష్ణుడ! రామకృష్ణకవి కృష్ణుడ! నిన్ను ప్రశంస జేసెదన్ 19

కొరివి కారమునకు గోంగూర జోడించి
పేరినట్టి నెయ్యి పెరిమ కలిపి

తిన్నవాడవేము తెన్నాలి రామయ్య!
కమ్మదనము నీదు కవితకబ్బె. 20

ఆవకాయ ఘాటు – ఆంధ్ర సుందరి నీటు
అరవ జనులలోని అదిరిపాటు
చింతచెట్టు చిగురు – చిన్నారి పొగరు నీ
రమ్య కవిత నలరె రామకృష్ణ ! 21

అల్లసానివారి అతివ వరూథిని
తిమ్మనార్య సుకవి తెరవ సత్య
భట్టుమూర్తి పద్మపత్రాక్షి గిరికమ్మ
రామకృష్ణ ! నీదు రామ యెవరు? 22

సంస్కృతాంధ్ర సమాస సరసాశుధారలో
పెద్దన్న మించి దీపింపగలవె?
సరస శృంగార సుందర కావ్య సృష్టిలో
తిమ్మన్న మించి వర్తింపగలవె?
ఘటికా శతగ్రంథ కల్పనమ్మందున
భట్టుమూర్తిని మించి పలుకగలవె?
కమనీయతర కథాగ్రథన కౌశల్యమ్ము
సూరనార్యుని మించి చూపగలవె?

భువన విజయ సభాస్థాన పూజ్యులైన
కవివరేణ్యులు వీరు దిగ్గజ సమాను
లంత గర్వమ్ముతోడ పల్కాడకయ్య!
పిన్నవాడవు రామలింగన్న ! నీవు. 23

సభాసదులు:

సంతృప్తి కల్గెనా! సహృదయాగ్రణులార!
ఈ కవీంద్రుల పద్యసృష్టి వలన

పరితృప్తి కల్గెనా ! పరమ భావుకులార !
ఈ పండితుల వచోవృష్టి వలన
మనసులు పొంగెనా? మహిత తాత్వికులార!
ఈ భావుకుల భావశోభ వలన
హృదయముల్ విచ్చెనా? మృదుల చేతనులార !
ఈ రసాత్ముల కళాహేల వలన

పండితులు మీరు రమ్యభావనులు మీరు
సహృదయులు మీరు సద్విమర్శకులు మీరు
వీరివీరి కవిత్వ విహార రీతి
మీరు పరికించితిరె? సభాస్తారులార! **24**



# ప్రగాఢ సంతాపం

ఈ క్రింది కవుల, వీరసైనికుల, పేద ప్రజల మరణానికి 'చైతన్య కవిత' మరియు 'శ్రీరస' తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియ జేస్తున్నాయి:

1. ఎం.ఆర్. చంద్ర, 19-2-1999, చిత్తూరు.
2. వేదుల సూర్యనారాయణ శర్మ, 2-8-1999, తణుకు.
3. 'ఎల్లోరా' (గొడవర్తి భాస్కరరావు) 8-8-1999, కాకినాడ.
4. డా॥ సూర్యదేవర సంజీవదేవ్, 25-8-1999, తుమ్మపూడి.
5. కార్గిల్ యుద్ధంలో నేలకొరిగిన భారత వీరసైనికులు.
6. **29-10-1999** నాటి భయంకరమైన తుఫానులో ఒరిస్సా రాష్ట్రంలో అసువులు బాసిన వేలాది అమాయక ప్రజలు.
7. శనగన నరసింహస్వామి, 21-12-1999, విజయవాడ.

## సామాన్యజనుల పక్షపాతి:

# జోసే సారామాగో

### (1998 నోబెల్ బహుమతి గ్రహీత)

-రిచర్డ్ బోద్రే

పోర్చుగీసు కథకుడు జోసే సారామాగో వ్రాసిన పరవశింపచేసే కథలు, చారిత్రాత్మక, వాస్తవిక వ్యంగ్య రచనలు, ఆయనను గొప్ప నవీన కల్పనాశక్తిగల గ్రంథ కర్తగా సమకాలీన రచయితలలో ప్రముఖ స్థానంలో నిలబెట్టాయి. ఆయన 1998 అక్టోబర్ 8న నోబెల్ బహుమతిని అందుకున్నారు.

75 సంవత్సరాల ఈ పోర్చుగీసు రచయిత అజ్ఞాతంలో నుండి జీవితంలో ఆలశ్యంగా బయటపడి పోర్చుగల్ దేశపు గొప్ప రచయితగా గుర్తింపబడ్డారు. ప్రపంచంలో 140 మిలియన్ల ప్రజల భాషయైన పోర్చుగీసు భాషలో ఈ బహుమతిని అందుకున్న మొట్టమొదటి రచయిత ఈయన.

సారామాగో రచించిన 19 నవలలు, నాలుగు నాటికలు, మూడు కవితా సంకలనాలు, ప్రతిమాభంజక సాహిత్యంతో, సంప్రదాయాన్ని, మాతాచారాల్ని ఎదిరిస్తూ సామాన్యజనుల పక్షపాతంతో సాగినవి.

స్వీడన్ దేశపు అకాడెమీ సారామాగోను ఎందుకు ఎంపిక చేశారన్న ప్రశ్నకు, ఎన్నేళ్ళుగానో పోటీలో ఉన్న ఈయన రచనలు ''గొప్ప ఊహాగానం, జాలి, కరుణ, పరిహాస పూర్వక వక్రోక్తితో మనకి ఒక భ్రాంతి నిండిన వాస్తవికతను చూపిస్తూ అవిచ్ఛేదంగా సాగుతాయి'' అని సమాధాన మిచ్చింది.

''సంప్రదాయాన్ని ప్రేరేపిస్తూ, సమూల సంస్కరణ అవసరమన్నట్టుగా ఉంటాయి ఈయన రచనలు -'' అని ఉంది అకాడెమీ ఇచ్చిన ప్రశంసా పత్రంలో.

వినయ విధేయతలతో, సన్నని ఆకారంతో ఈయన చూడటానికి వయసు నిండిన క్లర్క్‌లాగా కనబడతారు కానీ ఒక మహారచయితలా కాదు. తనకు నోబుల్ బహుమతి వచ్చిందని ఆయన ఫ్రాంక్‌ఫర్ట్‌లో జర్మనీ దేశపు పుస్తక ప్రదర్శన నుండి విమానాశ్రయానికి వెళుతూ వార్తల్లో విన్నారు. స్పెయిన్‌లోని కెనరా ద్వీపాల్లోని తన స్వస్థలానికి వెళ్ళకుండా మళ్ళీ పుస్తక ప్రదర్శనకు తిరిగి వచ్చి, అక్కడ జనసమూహంతో ఘనంగా శ్లాఘింపబడ్డారు.

బహుమతి మొత్తం 978,000 డాలర్లను గురించి మాట్లాడుతూ, ''అది తలమీద మోదినట్టుగా ఉంది కానీ క్రింద పడిపోయేంత కాదు'' అన్నారు. ''అటూ ఇటూ అర్థం లేకుండా తిరిగి తిరిగి ( అలాంటి శుభవార్త విన్నాక) విషయ ప్రపంచంలో మళ్ళీ పడతాము'' అన్నారు.

''పోర్చుగీసు భాష మాట్లాడే వారందరికీ ఆ బహుమతి చెందుతుంది'' అని ఆ మొత్తాన్ని మాత్రం ఆయనే ఉంచుకుంటానన్నారు హాస్యధోరణిలో.

సారామాగో 1982లో ''బల్టాసార్ అండ్ బ్లిముండా'' అనే నవలలో ప్రపంచ ప్రఖ్యాతినార్జించారు. దైవదూషకమైన, హాస్యపూరితమైన ఆ నవల 18వ శతాబ్దంలో పోర్చుగల్ దేశపు ఒక ప్రేమజంట, పోలీస్ విచారణను తప్పించుకునేందుకు ఒక ఎగిరేయంత్రంలో (Flying Machine) పారిపోవటాన్ని వర్ణించేది.

అతి ప్రాముఖ్యత పొందిన రచన ''దస్టోన్ రాఫ్ట్'', ఐబీరియన్ ద్వీపకల్పము, యూరోప్ఖండం నుండి విడిపడి, అట్లాంటిక్ వైపు సాగిపోవటాన్ని గూర్చి వివరించేది. వాస్తవికతకు దగ్గరగా అభూతకల్పనతో, రాజకీయాన్ని అపహాస్యం చేస్తూ సాగే ఈ నవల, ముగ్గురు మగవాళ్ళు, ఇద్దరు ఆడవాళ్ళు యథార్థ వాదంతో తమను గూర్చి తాము తెలుసుకోవాలనే ఆత్మాన్వేషణను ముఖ్యాంశంగా తీసుకుని వ్రాసినది.

''న్యూ టెస్టామెంట్''ను గురించి క్రొత్త దృక్పథంతో తాను రచించిన ''ద గాస్పెల్ ఎకార్డింగ్ టు జీసస్ క్రైస్ట్''ను రోమన్ కాథలిక్ చర్చ్ పట్టుదల మీద ప్రభుత్వం ఆ నవలను ''1991 - యూరోపియన్ లిటరరీ ప్రైజ్''కు పోటీలో పాల్గొనేందుకు అనర్హమని ప్రకటించిన నేపథ్యంలో, సారామాగో పోర్చుగల్ దేశాన్ని నిరసనతో విరుద్ధాభిప్రాయంతో వదిలేశారు.

ఇతర ప్రేరేపణలతో పాటు, ఈ నవలలో జీసస్ పుట్టుకను గురించి, ఆయన తన తల్లిని నిరాకరించి మేరీమేగ్డెలీన్తో సహచర్యం చెయ్యడాన్ని ప్రశ్నిస్తూ, బాధ, మృత్యువు, మానవుల్లో అసహనాన్ని నింపే మతాన్ని ఒక విరక్తభావంతో భగవంతుడు సృష్టించినట్టుగా చిత్రీకరించబడ్డది.

ఆయన దైవ వ్యతిరేకి, తప్పుకు పశ్చాత్తాపపడని పోర్చుగల్ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడని, సారామాగో కు ఎకాడెమీ ఇచ్చిన గుర్తింపుని వాటికన్ విమర్శించింది.

'లాఒసర్వాటరో రొమానో' అనే వాటికన్ నగర దినపత్రిక ఆయన నవలను ''దృఢమైన మతవ్యతిరేకభావాలకు దృష్టాంతము'' అని ఖండించింది.

కానీ పోర్చుగల్ నాయకులు, నేతలు, ప్రపంచం అంతా అందిస్తున్న ప్రశంసల్తో గొంతు కలిపారు.

''మొత్తానికి, పోర్చుగల్ దేశపు సాహిత్యానికి న్యాయం జరిగింది..!'' అని సారామాగో దేశాన్ని వదిలిన సమయంలో రాష్ట్రపతిగా ఉన్న మారియోసోరిస్ పేర్కొన్నారు.

ప్రస్తుత రాష్ట్రపతి జార్జ్ సాంపాయియో, ''జోసే సారామాగో ఒక విశ్వరచయిత, గొప్ప చిత్రకారుడు, గొప్ప సృష్టికర్త'' అని మెచ్చుకున్నారు.

స్వీడన్ దేశపు పారిశ్రామికవేత్త, 'డైనమేట్'ను కనిపెట్టిన శాస్త్రజ్ఞుడు ఆల్ఫ్రెడ్ నోబెల్ స్థాపించిన నోబెల్ బహుమతిని అందుకున్న నాలుగో యూరపు దేశస్థుడు సారామాగో. 1901 సంవత్సరం నుండి సాహిత్యరంగంలో, రసాయన శాస్త్రంలో, వైద్యశాస్త్రంలో, భౌతికశాస్త్రంలో, శాంతికి ఈ బహుమతిని ఇస్తున్నారు. 1969 నుండి ఆర్థిక శాస్త్రంలోనూ ఇవ్వడం జరుగుతోంది.

సారామాగో ''ఆర్థిక పుష్టికల దేశాలక్లబ్''లో చేరటానికి అంత సుముఖంగా లేకపోయినా, పోర్చ్‌గల్ నాయకులతో శాంతి సంబంధాలు నెలకొల్పుకున్నారు.

స్పెయిన్ దేశపు భార్యతో, చాలాసార్లు పోర్చుగల్లు రాజధాని ''లిస్బన్''లో ఉన్న తమ ఇంటికి వెళ్ళి, సమయం గడుపుతూ ఉంటారు.

ఒక పేదరైతుకు సంతానంగా, సారామాగో హైస్కూల్ చదువు మానేసి, తాళాలు తయారు చేసే కంసాలి వృత్తిని చేపట్టారు. ఆయన 1947లో ప్రచురించిన మొదటి నవల -'కంట్రీ ఆఫ్ సిన్'లో క్లిష్ట పరిస్థితుల్లో రైతుల ధర్మవిచారం, నైతిక విలువల్ని గురించి వ్రాసారు.

20వ శతాబ్దంలో పోర్చుగీస్ దేశంలాగానే, సారామాగో ఆలస్యంగా అభివృద్ధిలోకి వచ్చారు. ఒక జర్నలిస్ట్‌గా, భాషాంతరం చేసేవాడుగా, ఆయన కొన్ని రచనల్ని మాత్రమే, 41 ఏళ్ళు సాగిన 'అంటానియో ఒలివేరియా డి సాలాజార్' నిరంకుశ ప్రభుత్వం 1974లో ముగిసే వరకూ చేసారు.

'రైజింగ్ ఎర్త్' అని నిరుపేదల తిరుగుబాటుని గురించి హృద్యంగా రచించిన ఆయన నవలకు లిస్బన్ అత్యుత్తమ నవలా బహుమతిని ఇవ్వటం జరిగింది. తన 58వ ఏట ఆయనకు విరివిగా అమ్ముడయ్యే రచనలు చేసే నవలా రచయితగా గుర్తింపు వచ్చింది.

లాస్ ఏంజలిస్ టైమ్స్ పుస్తక సమీక్షకుడు రిచర్డ్ ఎడర్ తన సమీక్షలో ''సారామాగో సమసిపోని, సంపూర్ణమైన పోర్చుగీసు లక్షణాలున్న రచయిత'' అని వ్రాసారు.

శతాబ్దాలుగా దేశం మసకచీకట్లలో, హీనదశల్లో, నిరాశానిస్పృహల్లో ఉంటే, ఎంతగొప్ప రచయిత అయితే మాత్రం రచనల్లో ఒక సంశయ శీలత, వ్యాకులత లేకుండా ఎలా వ్రాయగలడు? కానీ ఈయన ఎడారిలో వికసించిన పుష్పంలా అత్యద్భుతంగా హాస్యాన్ని, అభూతకల్పనను ఒక సమన్వయంతో తన రచనల్లో నింపి సందేశాత్మక రచనలు చేసారు.

('లాస్ఏంజలిస్ టైమ్స్' నుండి అనువాదం: అంబికా అనంత్)



**ఆశుకవీ! జయోస్తు! కమలాసను పట్టపురాణి చేతి లీ**
**లాశుకవీ! జయోస్తు!!**

**కులపతివై ! నవయుగ కవి**
**కులపతివై ! భువన విజయ గోవర్ధన గో**
**కులపతివై ! శ్రితరజతా**
**చలపతివై ! మనుము కనుము సకల శుభమ్ముల్!!**

**-కరుణశ్రీ (డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి)**

# ఇనుప గొలుసులు

-జోసే సారామాగో

వెలుతురు కోసం తలుపులు తీస్తే
తుఫాను తోసుకొచ్చినట్టు
ఆత్మతృప్తి కోసం అక్షరాన్ని ఆశ్రయించి
కవితావిష్కరణం చేస్తే
కత్తికటారుతో భూతద్దంతో
డిసెక్షన్‌కి క్రిటిక్స్ ప్రత్యక్షం!

"Best criticism is always negative"
అనే పంథాలో కొందరు
పొగడ్తలూ పూలగుత్తులూ తప్పు ఇవ్వమనే
అతి పెద్దమనసుతో కొందరు

మనసుల్ని పండించే
అమ్మ ప్రేమలోని తియ్యదనం
చంద్రునిలోని చల్లదనం
అవి కవితలో కనిపిస్తే మాత్రం పాతభావం
కొత్తరంగులు పులిమిన పాతదనానికి అంగీకారం
అది ఏ ఇజమ్‌కి చేరిందోఅనే శోధనం

అక్షరాలకు పూలరేకులు అద్దితే
బరువుగా సాగదట కవితావస్తువు
పదును పెడ్తే కవిత పట్టీలు వెయ్యాలి కానీ
గాయం చేయకూడదనే ఓ పిడివాదం

పుస్తకాలు చదవకుండా వ్రాయటం నేరమట
భావం, భాష నిస్సారమట
ఆ స్పాంటేనిటీ, నాచ్యురాలిటీ అనవసరమట

పుస్తకాలు చదివి చదివి వ్రాస్తే
భావం ఎక్కడిదో అప్పు చేసినదయ్యుండవచ్చునట
గొప్పకవులకూ ప్లేజియారిజమ్ గొప్ప వీకనెస్ అట!

లేబుల్ లేని మందుని తీసుకోవడానికి భయం
లేబుల్ వెయ్యకుండా కవిని వదిలెయ్యడం నేరం
ఏదో స్లాట్‌లోకి సొంతం దించకపోతే
బంతిలో వలపక్షం?!

కత్తి దూసినవాడు
ఏవో కారణాలు చెప్పి అవుతున్నాడు Free man
కలం పట్టినవాడు
ఎన్ని కన్విక్షన్స్ ఉన్నా కాలేడు Free man
ఏ మనిషి ఎలా స్పందిస్తాడో
ఏ వక్రకోణంలో చూస్తాడో
అక్షరాలకి లేని అర్థం ఆపాదిస్తాడో
ఉన్న అర్థం అలికేస్తాడో ...

కలుపు తీసి, ఎరువు వెయ్యాల్సిన
విమర్శకుడు మొత్తం మిట్టపల్లం చేస్తాడో
ఇన్ని ద్వంద్వాల ఇనుప గొలుసుల
మధ్యన ఇరుక్కుపోయిన
కలం కత్తికన్నా గొప్పదా?

గొప్పదైనా పట్టిన చేతినే ఖండించే
రివర్స్‌గేర్‌లో సాగుతుందా...?!

(అనువాదం: అంబిక)



# శుభాగమనం

– డా॥ సోమసుందర్ ఆవంత్స

ఇంక లోకము విరియదా, కా
సంత మనసుకు హాయిగా...
సకల జనతా సౌఖ్యదాతగ
సౌమనస్యము పండదా?....

కులము సంకుల కశ్మలముగా
మతము గతముల అంధతమముగ
ఎన్ని నాళ్ళీ మనిషి గుండెలు
విలయ వలయమునందు మ్రగ్గుట?

సకల హృదయాంతర పరీమళ
శేముషీ పీయూష లహరులు
సాగగా – కాలుష్యమంటని
నవయుగోజ్జ్వల శుభాగమనం
ఈ శతాబ్దికి ఐతిహాసిక
శక్తిగా లభియించదా?

వసుమతీ హృదయమ్ము మధుతర
స్వప్నవీచిగ మేలుకాంచగ
నరులు నరులే యేరులై
పొంగాలి మంచికి మారుపేర్లయి...

అమృతోత్సవ వర్షశీకర
మమరవలె నలుగడల లోకము;
చీకుచింతలు డుల్లిపడి – సుఖ
నవోదయమ్మై విరియవలెనిక...

నభము శుభకర కాంతిధారగ
అభయ విద్యుత్‌రేఖ కావలె...

జనశ్రేణుల రుచిర హృదయాల్
నవ వనాంతర కుసుమ సీమల
సంతతము వికసించి ఆశలై
గాలిపై తిరగాలి కడలకు...

పూవులై పాటలై కలలై
పరిమళములై అలలు అలలై
గాలిపై తిరగాలి నిరతము
నరుని హృదయోత్సాహమై...

మనిషి మనసే మల్లికాలత
స్వప్ననిచయము లమర సుమములు -
కపట వేషము లెరుగరానిది
కలుష దూషిత మొదవరానిది
పసిడి బ్రతుకుల క్రొత్తగీతము -
ప్రాకవలె పరిమళము రీతిగ....

ఇంత చక్కని వసుమతిని - ద్వే
షాగ్ని లెందుకు రాజపెట్టుట?
అవని నవనవ మానవీయము,
వనమయూర కలాప నాట్యము....

దుఃఖములు, ఆకళ్ళు, చావులు
సంకెలలు కనిపించ వికపై
జనసమాజము శుభ్రహాసము,
శుభమయూఖము, నభశ్శాఖము -

ప్రాయములు ప్రాలేయములుగా
కరుగవిక అర్థాంతరముగా...
ప్రాణములు నిర్ప్రాణలోపడి
జీర్ణపత్రాలగుట పొసగదు!

ఈ వసుంధర సకల సంపద్
వంతమై, వాసంతగీతము
ఒక నవీన వ్యవస్థార్థము
స్వాగతముగా ఆలపించును!

నవయుగోదయ రుచిర వేళా
భూషణములివె రండి దాల్చగ!
పుష్పభర నందన వనమ్ములు
వినిచె నామంత్రణము లివిగో!

మధుర యువ సాహస్ర మాన్మథ
స్వాగతములివె, అందుకొండో!
నరుల నారీ హృదయ మంజుల
గీతికలుగా లేచిరండో!

నవ యుగోదయ శుభోత్సవమిది
అరుణ కుసుమాక్షతలు తాల్చుడు!
హృదయ రుధిరము పొంగ నాకస
వీథిలో ఒక నవ మయూఖము!

హృదయ రుధిరము పొంగ
నాకస వీథిలో మధుమాస దీధితి
నరుల కామిత సఫల ఫలముల
ఉదయ కిరణారుణ రసమ్ములు!

ఒక హిమానీ తుహిన బిందువు
మనిషి గుండెల విషము క్రమ్మదు;
స్వార్థ మోహాంధమ్ము పెనగొని
లోక శ్రేయః కాంతి కూల్చదు;
మరల ఇరులను క్రమ్మగిలోకము
సుడుల గుండము ములుగ దికపై!

రండి వేంచేయండి - నరులో
నారులో నవ్వులో ననలో
రండి తరుణము మించరాదిక
నవ మధూత్సవ మధువుకై....

(విశాఖ ఆకాశవాణి సౌజన్యంతో)



# హిమగిరి

- శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

ఉ॥ కొండలరాయడా! చలువ
గుండెలలో కరుణార్ద్రభావముల్
నిండినవాడ! నూత్న
రమణీయ కథామహనీయ పుణ్యముల్
పండినవాడ! మా మహిత
భారత భూమికి అండదండగా
నుండినవాడ! నిన్ను మధు
పూరెడు కమ్మని తెల్గుకైత పూ
దండ నలంకరింతు బహుధా
వినుతింతును నీ మహోన్నతిన్. 1

ఉ॥ చల్లని చేతులన్ నిమిరి
శాంతి కపోతము లేత రెక్కలన్
మెల్లన దువ్వి మా భరత
మేదిని వీథుల మించిచాయ వ
ర్థిల్లగ జేసి మా బ్రతుకు
తీరు సుఖమ్ముగ సాగునట్లు భా

సిల్ల నొనర్పుమా తుహిన
శీకర శీత దృగంచలంబులన్. 2

గీ॥ జిలుగు వెన్నెలతోడ కాశ్మీర లక్ష్మి
చరణపీఠము కైసేయ భరతమాత
ధర్మ మణి మకుటమ్ముగా తల ధరింప
అలరుమా మానవశ్రేణి అంజలింప. 3

గీ॥ తరతరాలుగ గుండెలో దాచుకొన్న
బుద్ధ దేవుని కరుణా ప్రబోధగీతి
తిరిగి విన్పించు మీనాడు దిక్కులన్ని
సుప్రశాంతి మాధుర్య వీచులను దేల 4

సీ॥ పార్వతీ పరమేశ పరిణయ వైభవం
బును సంతరించిన పుణ్యమూర్తి
మంగళదాయిని గంగాస్రవంతికి
మురిపాల ముత్యాల పురిటిగీము
భారతి జనని సౌభాగ్యంబు బింబించు
తనుపైన మాణిక్య దర్పణంబు
మహనీయ కమనీయ మహిమాలయముగ ప్ర
తిష్ఠ నార్జించిన దేవతాత్మ

గీ॥ కాళిదాసాది సత్కవి కావ్యసౌధ
వీథిలో నిత్య నూతన వివిధగతుల
రూపుగట్టిన సౌందర్య దీపకంబు
నైన హిమశైలరాజ! నిన్నభినుతింతు. 5

సీ॥ వ్యాస వాల్మీకి ముఖ్యర్షి కవీంద్రుల
పావన వృత్తము వక్కణించి
జీమూతవాహన శిబి కర్ణులాదిగా
త్యాగధనుల చరిత్రలు వచించి

రాణాప్రతాప వీరశివాజి మున్నుగా
యోధుల గాథల నుగ్గడించి
తిలకు నేతాజి గాంధీజి ప్రముఖ దేశ
భక్తుల కథలను ప్రస్తవించి

గీ॥ త్యాగ యోగ నిర్మల ప్రతిభా వరిష్ఠ
మానితానూన దేశాభిమానములను
సంతరింపుము భారత సంతతికిని
అమిత మహితాశయస్సాంద్ర! హిమగిరీంద్ర! 6

క॥ నీ మహిమకు, నీ రుచిర
శ్రీమణి కాంతి ప్రసార శిఖరావళికిన్
కోమల మానసమునకున్
కైమోడ్పులు హిమగిరీశ! కమనీయగుణా! 7



# ఒక జాతిని మరొక్క జాతి....

– డా॥ అద్దేపల్లి రామమోహనరావు

నాయనలారా! వెళ్ళిపోండి! వెళ్ళిపోండి!
అమెరికా వెళ్ళిపోండి! అమెరికా వెళ్ళిపోండి!
ఛాందసుల పిల్లల్లారా! అమెరికా వెళ్ళిపోండి!
హేతువాదుల పిల్లల్లారా! అమెరికా వెళ్ళిపోండి!
కమ్యూనిస్టుల పిల్లల్లారా! అమెరికా వెళ్ళిపోండి!
తీవ్రవాద సమర్థకుల బిడ్డల్లారా! వెళ్ళిపోండి!
స్వేచ్ఛ ఎక్కువైన ఈ దేశంలో
నెలకు లక్ష యిచ్చినా పనిచెయ్యడం కష్టం

గర్వించదగిన బానిసత్వంలోనే
శ్రమపడగలమని రుజువు చెయ్యండి
నాయనలారా! అమెరికా వెళ్ళిపోండి!
భావ జాలాల యుద్ధాల చీకటి దోవల చివర
గుడిగోపురం మీద ఆరని వెలుగు డాలరుదే అని
అందరి కళ్ళూ తెరిపించండి! వెళ్ళిపోండి! వెళ్ళిపోండి!
ఇక్కడ మేము అమెరికాభజన చేస్తూ కుర్చుంటాం
రోజూ చెత్త రోగిష్ఠి సెక్సునీ, క్రూర బీభత్స హింసనీ
తెరల సిరింజిల ద్వారా ఎక్కిస్తున్న హాలీవుడ్ సినిమాల ముందు
భారతదేశపు మహోన్నతమైన సినిమాలన్నీ
దిగదుడుపే అని చాటుతాం!
మూలాధారంలోంచి ఆందోళన కలిగించే
అమెరికా సంగీతాలు, నాట్యాలు పూసుకుని
మా దేహాంచలాల నిండా గుండెలు బాదుకుంటాం!
దేశ భక్తి పొంగిపోయి పాప్‌ట్యూన్‌లో ఇంగ్లీషు భాషలో
'ఐ లవ్ మై ఇండియా' అని కేకలేస్తాం!
నాయనలారా! మీ కెందుకు మీరు అమెరికా వెళ్ళిపోండి!
ఆర్యుల దగ్గర నుండి అమెరికా వాళ్ళదాకా
ఆయుధాలు దోచుకున్న సంపదలు ఎవరి దగ్గరుంటాయో
వాళ్ళదే అందం! వాళ్ళదే కళ! వాళ్ళదే సంస్కృతి!
గాట్‌లు, గేట్‌లు, పేటెంట్లు
వరల్డ్ బ్యాంకులు, ఇంటర్‌నెట్‌లు, గ్లోబలీకరణలు
అన్నీ నాయకుల సంతకాల సముద్రాల్ని పొంగించి
ప్రజల చెలియలి కట్టల్ని కరిగించి ఛిన్నాభిన్నం చేసి
ఇక్కడి మట్టిరంగుని మార్చెయ్యనివ్వండి!
మీరు కొన్ని తరాలు అక్కడ స్థిరపడిపోయిన తర్వాత
ఎప్పుడో 'గేట్స్' అన్నీ మూసేస్తారు
అప్పుడు టెర్మినేటర్ విత్తనాలు పొలాలకే కాదు
మనుష్యులకీ సప్లై చేస్తారు

ఆలోగానే బహుశా సెక్స్ షాపులూ, సెమన్ బ్యాంకులూ
అమెరికా నుంచి దిగుమతి ఔతై
ఆ బాధాలన్నీ మీకెందుకుగానీ
నాయనలారా! మీరు అమెరికా పారిపోండి!



# చాటింపులు

-శ్రీ వెంపో

పన్ను రూపాన ప్రజలిచ్చు ప్రభుత సొమ్ము
మెక్కుచుండి ఉద్యోగులు మితము గనక
లంచములు కూడ చేపట్ట కించపడరు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపో! 1

పాడిగేదె బండెద్దుతోపాటు భార్య
కూడ మగవారి బానిసై మడియుచుంట
నేటికిని న్యాయమై చెల్లు నీతిగనుము
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపో! 2

అన్నమడుగని బొమ్మకు అన్నమిడుచు
అన్నమని యేడ్చు అమ్మకు అన్నమిడరు
అమ్మ మనిషికి చేయదా బొమ్మపాటి
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపో! 3

కన్న తల్లిని మించిన కరుణమూర్తి
మీగడ పెరుగు ముద్దల మించు రుచియు
సద్విమర్శకునిఁబోలు సఖుని గనము
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపో! 4

చలనచిత్రాల పేర అశ్లీలమైన
బూతుబొమ్మలు చూపించి నీతిదప్పి
డబ్బులేరుకొని తినును గబ్బుగాడు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 5

నెత్తి పెంచి, మూతి గొరిగి, నెయ్యి త్రాగి
నున్నగా బలిసిన సామి తన్నుతాను
భువి నవతరించిన స్వయంభువుడ ననును
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 6

వలస దోపిడి పోయినా ఫలితమేమి?
ధనికులకె కట్టబెట్టిరి వనరులన్ని
బీదలకు కొట్టినారు బూడిదను నోట
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 7

కూలికై సభకు జనుల కూడగట్టి
ప్రజల మనిషిని తానను భ్రాంతి గొలుపు
వంచకులె నాయకులు నేడు యెంచగాను
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 8

కుటిల రాజకీయుల కుంభకోణములతో
వేలకోట్ల రూకలు దిగమ్రింగినారు
దేశ ప్రగతికి ఎక్కడ దిక్కు ఇంక
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 9

నీ మొగుడు నిన్ను ముద్దాడు సమయమందు
నా విషయ మాతనికి జెప్పి బ్రోవుమనుచు
దేవుని సతికి మొరలిడు తీరు గనుము
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 10

పేదల వెతల బ్రతుకులు పెట్టుబడిగ
పెద్దమనుషులై పోవుట కద్దుగాని

పేదరికము తొలగింప కుదరగలదె?
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 11

పరిమళ భరితమై పూలు పలురకముల
రంగులద్దుకొని విరాజిలంగ మురికి
తోలుతొ మనిషి దుర్వాసనలను జిమ్మ
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 12

మనుషులను వేరుచేయును మతములన్ని
మతము లేకుండ మనుషులు బ్రతుకవచ్చు
మానవమతమునకు మించు మతము లేదు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 13

కట్టుకొన్న వస్త్రములిచ్చు కంటికింపు
పెట్టెలో దాచిన పురుగు పట్టిపోవు
ప్రజల నోటనంటు కవిత ప్రభలు జిమ్మ
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 14

కలసి బ్రతుకుదమన్నచో కలసిరారు
చీలిపోవుటయన్నదే చెల్లు నేడు
పోవుకాలాన పట్టెడి బుద్ధులివియె
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 15

మనిషి పుట్టక పూర్వమె మతము, సాంప్ర
దాయముల మూసలో బిగిసి తనుదాల్చి
సొంత ఆలోచనలు లేక బ్రతక నేర్చు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 16

ఎన్నికల బరిలొ దిగిన యెవడుగాని
చేయనని చెప్పు దేపని చేయునొకటి
ఎన్నికైన పిదప చూపు వెన్ను మనకు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 17

 17

తిరుపతికి చేరు భక్తులు తరగరెపుడు
వేద విధులను జరుపుట వదలరెవరు
నీతి నిలకడ మాత్రము నిండు సున్న
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 18

మనుషులు కలసి యున్నట్లు మసలు చుండి
మనసులో ఒకరినొకరు మట్టుబెట్టు
మార్గములకై వెదకులాట మానరెపుడు
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 19

బూతుబొమ్మల సంస్కృతి పురులువిప్పి
యువత జీవిత గతిపైన ఆవహింప
జాతి జీవితమే భయభ్రాంత మాయె
నిప్పువంటి నిజము చాటి చెప్పు వెంపా! 20



# పుత్రోత్సాహం

-శ్రీ 'భగ్వాన్'

మేడలో నువ్వు - రోడ్డున మేము
ఏ నేరానికి మాకీ శిక్షో సెలవిస్తావా కొడుకా?
కనడాన్ని పెంచడాన్ని ప్రేమించడాన్ని నేరాల్ని చేసిన
దయగల పుత్రుడా!
చాలు చాలు ఈ జన్మకీ శిక్ష చాలు
నీ వయసంత ప్రేమను మూట కట్టుకుని
నిన్ను చూద్దామని వస్తే
ఎలక వరిదుబ్బుల్ని కొరికినట్టు నువ్వు మా గుండెల్ని నరికావు
నీ భార్యా బంధువుల ముందూ నీ ప్రియస్నేహితుల ఎదుటా
మమ్మల్ని పనివాళ్ళుగా నిలబెట్టావ్

మాకు చావును రుచిచూపించిన కొడుకా!
నీలాంటి కొడుకు ఏ అమ్మా నాన్నకూ వద్దు
ఎండిన నేలకు వానై ప్రాణం పోస్తావనుకున్నాం గానీ
మా కలల బండికి ఆక్సిడెంట్ చేస్తావనుకోలేదు
చిన్నప్పుడు కాన్వెంటూ పెద్దయ్యాకా యూనివర్సిటీ
అమ్మా నాన్నల్ని ప్రేమించడం నేర్పనే లేదా?
నువ్వు చదివిన జీవశాస్త్రంలో మాకేదైనా శాస్త్రీయనామముందా?
వంద కిలోల ధాన్యం బస్తాని అవలీలగా ఎత్తిన భుజం నాది
నీ మాటల బరువుకు కుంగిపోయింది
ఇంటెడు చాకిరీతో రాటుదేలిన శరీరం మీ అమ్మది
నీ చూపుల దెబ్బలకు వణికిపోయింది
నువ్వు ఉత్తరమ్ముక్క రాస్తే చాలు
మా చెమట గింజల్ని డబ్బుగా మలచి తిరుగుటపాలో పంపేవాళ్ళం
నువ్వు కాకిచేత కబురుపెడితే చాలు
మా కడుపులు కట్టుకుని నీ అవసరం తీర్చేవాళ్ళం
అయినా సెలవుల్లోనూ నువ్వింటికి రాకుండా హాస్టల్లోనే గడిపేవాడివి
అది ఎందుకో ఇప్పుడే తెలిసింది
అమ్మ మెడలో గొలుసును ప్రేమించగలవు
అమ్మను ప్రేమించలేవు
నాన్న వెనుక ముల్లెను ప్రేమించగలవు
నాన్నను ప్రేమించలేవు
ఎకరానికి కేభై బస్తాలు పండించి ఆదర్శ రైతునయ్యాను గానీ
నిన్ను కని ఆదర్శ తండ్రిని కాలేకపోయాను
మేము నిర్ణయించిన సంస్కార సౌందర్యాన్ని కాలదన్ని
మాకు చెప్పకుండానే
డబ్బు పొగరు మెడలో నువ్వు తాళి కట్టినప్పుడు కూడా
నిన్ను దీవించామే కానీ నిందించామా...?
మా కన్నా నీకిప్పుడు నీ పెళ్ళాం పెంచుకుంటున్న కుక్కే ఎక్కువ
నీ ఫస్టురాంకూ నీ గోల్డుమెడలూ నీ సర్టిఫికెటూ

మేము నీ చుట్టూ అల్లుకున్న ప్రేమానురాగాల బలమేనని ఎరుగవా...?
నీ ఖరీదైనా కోటు నీ విదేశీకారూ నీ ఉన్నత ఉద్యోగమూ
మేము నీకోసం చేసిన పూజల ఫలితాలేనని తెలియదా...?
తెలిసినా తెలియనట్టు ఎంత సహజంగా నటిస్తావో
నటించడం నీకు చదువుతో మింగిన వెన్న
వాస్తవానికి అవార్డు నీకు చదువులో కాదు నటనలో ఇవ్వాలి
మా అరచేతుల మీద నడిచి నడిచి నువ్వు గొప్పవాడివయ్యావు
మేము మాత్రం
నువ్వు చదివి చదివి పారేసిన పాతపుస్తకాలుగా చిరిగిపోయాం
నువ్వు నమిలి నమిలి ఉమ్మేసిన కిళ్ళీమరకలుగా ఎండిపోయాం
పుట్టినప్పుడు అందరూ నీది గొప్ప జాతకం అన్నారు
ఏరుదాటి తెప్పను కాల్చేంత గొప్పవాడివవుతావనుకోలేదురా అబ్బీ...
క్షణం క్షణం మరణం మా నుదట రాసిన కొడుకా!
నిన్ను శపించాలనుందిరా, కానీ తండ్రినైపోయాను
ఇన్నాళ్ళూ పుత్రోత్సాహం తప్ప ఏ ఉత్సాహం ఎరగని వాళ్ళం
నీ ఆధునిక నాగరిక ధనిక రంగుల ప్రపంచంలో
ఏ రంగు ఎలా మారుతుందో ఆనమాళ్ళు తెలియనివాళ్ళం
మేం చనిపోయాకా
అందరి ముందూ ఏడుపు నటించకు కొడుకా!
మాకు తలకొరివి పెట్టి
డబ్బును మాత్రమే తాకే నీ నాజూకు చేతులకు
మసి చేసుకోకు నాయనా!
ఎప్పుడైనా నీ కొడుకు మాగురించి అడిగితే
ఏమీ చెప్పకు
నీలా వాడూ ద్రోహం చేయకుండా ఇప్పట్నుంచీ జాగ్రత్తపడు!



# జనాభా సమస్య

-డా॥ మల్లేల (మల్యాల) గురవయ్య

ప్రతి దినము జనాభా యిట్లె అతిశయముగ
హద్దు పద్దు లేక పెరిగి వ్యాప్తి జెంద
కడకు నిలుచుటకైన నెక్కడిది చోటు?
పాటు లెప్పటి వగునొ సాపాటు కొఱకు॥ 1

సంతు కొఱకె వివాహమ్ము సత్యపథము
నియమ నిష్ఠలు కలిగిన నీతి విధము
కామమే ధ్యేయమై సంతు కలిగెనేని
నరక మిచ్చుటనే పున్నామ నరకము నహి॥ 2

జవసత్త్వంబులు లేని తిండితిని నిస్సారంపు సంసారపుం
దేవులంటగ జవిలేని యీ బ్రతుకులో తీపున్నదేమో యటం
చవిరామంబుగ యత్నముల్ సలుపు భార్యాపుత్త్రా గాథానుర
క్తి విశేషంబున హెచ్చు సంతుగని దుఃఖింపంగ క్షేమంబెటుల్॥ 3

పంటలు కడు పండ ఫాస్పేటు యూరియా
మందులెల్ల వాడి మందులైరి
వాపువంటి బుద్ధిబలము హైబ్రీడట్లు
పెరుగ ప్రజల సంఖ్య పెరిగె నట్లె॥ 4

మితము హితమన్న సూక్తి సమ్మతము సతము
మన కుటుంబ నియంత్రణ మార్గమిదియె
మంది పెరిగిన కొలది నీర్మజ్జిగ మరి
పలుచనైనట్లు వమ్ము జీవనము సుమ్ము॥ 5

ఒక బిడ్డ బిడ్డ కాదను
వెకిలితనము వీడి లోక విధమును గని యే

యొకరేని చాలునని మీ
రికనైన్ర శాంతిసుఖము లెనయగ మనుడీ॥ 6

సంతానంబన దైవమిచ్చు వరమా! సంసారమే స్వర్గమా!
సంతోషంబది వారి కా వరమె యిష్టంబైనదో నేల నా
సంతాపంబు కుటుంబ రక్షణకు నశ్రాంతంబు స్వాంతంబు ని
శ్శాంతంబౌ టధికంపు సంతుఫలమే చాల్పుత్రుడో పుత్రియో॥ 7

నానాటికి పెరుగు జనా
భా నిట్టులె సాగజేయ భారతదేశం
బేనాడో త్వరలోనే
మానవు మానవుడెతినెడి మార్పు ఘటిల్లున్॥ 8

కాన మానవా! ఇకనైన మానవా మ
హా ప్రమాదమ్ము కల్గించు నట్టి విధము?
పూనుమా నేటికైన ప్రభుత్వ కృషికి
సిద్ధి కూర్చు కుటుంబ సంక్షేమ పథము॥
(తన్ను తా నుద్ధరణ చేయు ధర్మపథము) 9

అధిక సంతానమా? వలదండి! దాన
అధిక సంతాపమే కలదండి! కాన
దండిగ ప్రజల కనుట యుద్దండకార్య
మంచు దంపతులార! యోచించకండి॥ 10

పరిమిత కుటుంబ మెప్పు డ
పరిమిత సుఖ శాంతులలర భావి శుభములన్
వరలి, గృహచ్ఛిద్రము దు
ర్భర దారిద్ర్యము లేక భద్రయుతంబౌ॥ 11

మరణసంఖ్య తక్కువయౌట మంచిదె మరి
జననసంఖ్య మిక్కుటమైన జనము తుదకు
కూడు గూడును నిలువంగ నీడయేని
లేక యేమౌనొ ఊహింపలేదు జగతి॥ 12

జనము పెరిగినంత జగతి ప్రగతి యగునె?
సుగతి గనునె? శాంతి సుఖములున్నె?
సంతు పెరుగుటకును సాక్షి దేవుడటన్న
సుద్ది బుద్ది రహిత మిద్ది నిజము॥ 13

ఆయురారోగ్యములు కల్గి యందఱు నిల
శ్రేయమలర కుటుంబ సంక్షేమ పథక
మునకు బాసట యగుచు ప్రభుత్వ కృషి గ్ర
హించి యింక మిమ్ము మీ రుద్ధరించుకొనుడు॥ 14

ఈ జనాభా సమస్యయే యింక నెన్ని
యో సమస్యల కలిగించుచుండె నేడు
తినుటకుం దిండి చాలదంచును రసాయ
నికపుటెఱువులు వాడి పండించు పంట
కడుపులో మంట కలిగించి కానిపోని
జబ్బులం గూర్చి వేధింపసాగె ప్రజల॥ 15



# చరితార్థత

–ఎస్వీడి చంద్రశేఖర్

నా జీవితప్పుటలు చిరిగిపోక ముందే
నన్ను చూసి అందరూ వికృతంగా
పరిహాసం చేయక ముందే
నిన్ను గూర్చిన నా ఆలోచనల పాన్పు మీదనుంచి
నన్ను లేవనీ.

పశ్చిమాన చీకటి జ్వాలను అంటిస్తూ
అస్తమిస్తున్న సూర్యుడు కుంకక ముందే
నన్ను ఒక దివ్వెనై వెలిగి

చీకటిని పారద్రోలనీ
అపుడైనా ఈ జన్మకు
చరితార్థత ఏర్పడుతుందేమో?

నూరు ముక్కలైన ఈ గుండె కొసల్ని
ఎవరో ముడివేయక మునుపే
శతధా భిన్నమైన నా ఆలోచనలు
ఏ సుందర తీరాలకో అంకితం కాక మునుపే
వేయి భావాల జ్వాలనై
నన్ను రగుల్కోనీ
చీకటి ముంగిట
నిరాశను పరచుకొన్న నా సోదరుల జీవితాల్లో
చలనం రేకెత్తించడానికి –
సుందర సంతోష తీరాల వెంట
వారిని నడిపించడానికి –
జీవిత గమ్యాన్ని చేర్చడానికి –



# సత్యమేవ జయతే!

–శ్రీ అత్తిలి వేంకటరమణ

కన్యాకుమారికాగ్రమున అపాంపతి
త్రయము – ఏ దేవి పాదములు కడుగు,
ప్రాక్పశ్చిమావనీధ్రంబులు ఏ దేవి
తాల్చిన ధరణి వస్త్రపు బెడగులో,
గౌతమీ నర్మదా గంగా మహానదు
లే దేవి హీరహారాదికములు,
దేవర్షికోటి నందిత మహిమాలయం
బే దేవి మకుటమై ఇంపుగుల్కు,

ప్రకృతి సౌందర్యసముపేత, భవ్యచరిత
సకలసంపన్న సస్యసుశ్యామ, భాగ్య
సీమ, భారతమాతృలలామ- యుగము
లెన్ని గడచిన వేవెల్గుమిన్న యవుర! 1

వేదనాదామోద విశ్రుతంబై నింగి,
పుణ్యసంస్కార మూర్ధన్య మనిల,
మఖిల శౌచధురీణమై మించు అనలంబు,
పాప పుంజంబుల బాపు జలము,
అవతారపురుష పదాంకితంబౌ నేల,
పరమార్థదము పాంచభౌతికంబు,
తన సత్త్వమందు సత్య ప్రేమ ధర్మ శాం
త్యహింస లొప్పిన అమృతమూర్తి;
త్యాగులకు, భోగులకు, మహాయోగులకును,
వీర వరులకు, ధార్మిక శూరులకును,
దాన శౌండులకున్, దయాతత మతులకు
జన్మ నొసగిన దేవి - అస్మత్ సవిత్రి! 2

పరదాస్య శృంఖలాల్ పట్టి బంధింపగా
ఇచ్ఛోట చైతన్య మింకిపోయి,
వెలుగు చిన్నెయులేని భీకర కాళరా
త్రికి అంత మెప్పుడో తెలియరాక,
తొలి పరాజయములు మలి విజయంబుల
మెట్లుగా దెసల మిర్మిట్లు గొలిపి,
గమ్యంబువోలె మార్గము కూడ స్వచ్ఛమై
గాంధిజీ తీర్చిన కదనమందు,
దండి సత్యాగ్రహంబు క్విట్టిండియాల
నడుమ నెన్నియొ యుద్యమాల్ గడచి తుదకు
బ్రిటిషు పాలన తొలగగా రెపరెపలయి
మన త్రివర్ణపతాక సమ్మదము నింపె. 3

భేదవాదమ్ముల వికటాట్టహాసముల్
రణగుణధ్వనులైన రాజకీయ
మప్పుల పాలైన ఆర్థిక దురవస్థ
కులమతద్వేషాల కుమ్ములాట,
స్వార్థ ప్రవృత్తికి బలియైన జనహిత
మ్మవినీతి దోచిన అభ్యుదయము,
ఇదియేన, ఇదియేన, ఈ పాటిదేయౌన
స్వాతంత్ర్య భవ్య సౌవర్ణదీప్తి!
గాంధిజీ రామరాజ్య మిక్కరణి చెదరె,
నెహ్రూజీ భావుకతయు మున్నీటబడియె,
తను ధన ప్రాణముల్ సమర్పణము చేయు
మహిత చరితుల త్యాగము మట్టిగలిసె. 4

మన తాతలు మన తండ్రులు
పొనరించిన మేల్మిపనుల పున్నెము చెడగా
మన మిట్టుల చెలరేగిన
మన మనుమలకైన భాగ్య మహిమము వలదే? 5

చింతిల పనిలేదు చీకట్లు దట్టమై
వఱువాత దరిసిన వార్తదెల్పె,
క్రమ వికాసంబుగా రవిప్రకాశంబయి
సిలుగులు తొలగింప, జిలుగు లొలయు,
ప్రతి భారతీయుని స్వాంతాన భాసించు
దివ్య శక్తులకు సుదీప్తి కలుగు,
సకల గుణాంచిత సౌజన్య భరితమై
ఆత్మబలంబు - అవ్యాహతమగు,
సత్యధర్మము లస్త్ర శస్త్రంబు లగుచు,
భారతోర్వీ మహోరక్ష పరిఘవిల్లు,
ఏక వింశతితమ శతాబ్ద్యాకలితము
శుభ సమగ్రము, సిత యశశ్శోభ తనరు. 6

ప్రతిభకే యంతట పట్టాభిషేకము
యువతకే యచట పేరోలగంబు,
నిస్వార్థ సేవకే నీరాజనంబులు
శ్రమశక్తికే సదా జయ నినదము,
సౌమనస్యమునకే సర్వగౌరవములు,
స్థిరమైన ధిషణకే సింహపీఠి,
సామరస్యమునకే ఛత్రచామరములు,
వినయ శీలమునకే ప్రణతి శతము,

పిచ్చి కలయని తలపోయవచ్చు గాని,
సర్వు లీ కల గాంచుడీ సత్యనిష్ఠ,
దైవమున్ దిగివచ్చును ధర్మమెసగి
ధీర సముదార శతవర్ష భారతంబు! 7

*(16-8-1998 ఉదయం 7-50కి ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ప్రసారము చేయబడిన పద్యములు)*



# శాద్వలం

- డా॥ కన్నెకంటి రాజమల్లాచారి

వేళ్ళ కొసలతో మట్టి తిని
పువ్వుల చీరె కట్టుకొని
ముస్తాబవుతుంది

నిటారు మీదికొస్తున్న
సూర్య కిరణాలను కౌగిలించి
వెచ్చని బాధను తీయగా
అనుభవిస్తుంది
పచ్చగా పరవశిస్తుంది

ప్రళయకాల ప్రభంజనం వీచినా
కాళ్ళకింద మట్టికూడా కదలదు

తన కళ్ళముందు ప్రవహించే
కాలాన్ని ఎదిరించి
ఎన్ని తాటిచెట్లు వరదపాలైనా
తాను మాత్రం తాత్కాలికంగా
తల వంచుతుంది
తరువాత సానబట్టిన కత్తిలా
లేచి నిలుచుంటుంది.

ఫెళఫెళమని విరిగిపడిపోయే
మర్రిచెట్లు మరణానికి
సాక్షిగా నిలుస్తుంది

తొలకరి పలకరిస్తే చాలు
చిగుళ్ళు కనిపించేలా
కిలకిలా నవ్వుతుంది

మంచు ముత్యాల కలికి తురాయి
చల్లగాలికి మెల్లగా కదులుతూంటే
మహారాజులా ఠీవిగా నిలబడుతుంది

తనను కాళ్ళ కిందేసి తొక్కేవాళ్ళ
అడుగుల కింద పట్టు మడుగులు పరుస్తుంది
పెద్దపులుల పాదాల కింద కూడా
ఒద్దికగా ఒదిగిపోతుంది
పడుకోవడానికి వచ్చిన పాములకు
పక్కేస్తుంది.

జింక పిల్లల పెదవులు పెట్టే
ముద్దులకు మురిసిపోతుంది.
ఏనుగు బరువు మోసినా
తన వెన్ను వంగదు

కుంభవృష్టిలో కుదురుగా నిలబడి
తలారా స్నానం చేస్తుంది

తన గొంతు కొయ్యడానికి
నడిచి వచ్చే కాళ్ళకింద
పచ్చని తివాచీలు పరుస్తుంది

తనను వరించి వచ్చి
దిగంతాలలో
వంగిన నింగిని
సంబరంగా చుంబిస్తుంది.



# చేవ మొలిచిన దూదిపింజ

-శ్రీ అడిగోపుల వెంకటరత్నమ్

ప్రజలపై ఊరేగుతూ
పది చేతుల్తో వెనకేస్తూ
వాడు వాగ్దానాల వెల్లువై
నీటిమీద ఇసుక పత్రలపై
ఆశలు లిఖిస్తాడు!

ఒక అల వాడి వాగ్దానం మీద
నడిచిపోతుంది
ఒక పవనం వాడి రాతలపై
వీచిపోతుంది!

చెయ్యని బాకీ చెల్లించటానికి
నా పుట్టుక ఋణగ్రస్తం
తరగని వడ్డీ కొండల మధ్య

అసలుకు ప్రతీకను నేను
నగిషీలు చెక్కుతూ
ఒకరింట భ్రమణమై బందీని!

పలకా బలపం చూడని జీవితం
బతుకు సేవకే నన్ను వారసత్వపు
చట్రంలో బిగిసిపోయింది
అలా కాలం నడచి పోయింది!

ఇది గ్రీష్మం తీక్షణ వీక్షణం
కృతజ్ఞతల కుంభవృష్టి
ఇక వర్షించదు
చూపు నడక మాట
వడకట్టబడి ధవళవర్ణం తయారీ
నా చిరునామా
రహదారిపై ప్రత్యక్షం!

దూది పింజకు చేవ మొలిచి
గుప్పెట్లో దాగిన మనసు
పిడికిలిపై పొడుస్తుంది!



# మాతృభూమికి ముఖచిత్రం

– డా॥ రాజేశ్వరీ దివాకర్ల

అమితాబ్ బచ్చన్ సినిమాలో
విలపించిన ఘట్టానికి
ఏడుపొచ్చి బెంగటిల్లిన
లేతరాగాల ఆత్మీయుడు
స్నేహితుల సరదాలను

ఆప్తుల బంధాలను
సరికొత్త అనురాగాలను
అన్నింటిని వదలి
యుద్ధానికి తరలివెళ్ళాడు

అతనికి వీడ్కోలు చెబుతూ
కనబడకుండా దాచుకున్న తనవాళ్ళ కన్నీళ్ళను
చెంపలకు జారని నీటి నక్షత్రాలుగ
రెప్పల అంచున నిలిపి వచ్చినవాడు
జీవితంలోని విషాదాన్ని
అంకిత భావంతో అమరం చేసుకున్నాడు.

స్వప్నాలను చేజారిపోనీక
లక్ష్యాన్ని గుండె కానించిన
తుపాకి తూటాలకు గురిచేసాడు
దేహాన్ని హిమాలయం చేసి దేశాన్ని కాపాడినవాడు
మాతృభూమికి ముఖచిత్రమై మన్ననలనందుకున్నాడు
అతని త్యాగానికి సకలప్రశంస మూగపోయింది
అతనికి మేమున్నామని
భారత జనత ఒక్కుమ్మడిగా కదిలింది.



తాతలు తండ్రులున్ సుకవితా నిధులై సుతు లందుకొంటకే
చేతము పొంగు పట్టున వశీకృత మంజు కవిత్వ సంచిత
ఖ్యాతి గడించు ధీయుతుని గంటి నినున్ సుకృతమ్ము పండ నీ
కైతకు నీకు లెస్సయగుగా కవిభారవి! పోతరాట్కవీ!

- శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# రెండు కవితలు

-కవిశ్రీ మోహన ప్రసాద్

## 1. దీపకళిక

సీ॥ పక్ష మేదైనను పక్షపాతము లేదు
పసిడి కాంతుల దివ్వె ప్రమిద కెపుడు।
క్షేత్ర మేదైనను చీకటి బాపును
దేదీప్యమానమై దిశల కెపుడు ।
సమయ మేదైనను సమభావనను చూపి
ప్రగతి పథమునందు పరగు నెపుడు
దీప మేదైనను దివ్యాశయమొకటే
మానవసేవల మరువదెపుడు

ఆ.వె॥ అట్టి దీపకళిక నాదర్శమున్ గొని
వెల్గులందరారె విజ్ఞులార !
మనుజ జన్మమందు మాన్య చరితులార!
మానవత్వ మహిమ మరతురేల?

## 2. నమ్మను గాక నమ్మను

నా
సౌకుమార్యాన్ని స్తుతిస్తూ
ఆశువుగా అధరాన్ని వర్ణిస్తూ
కాళిదాసు కవిని
కోరిన నీ దాసుణ్ణే అన్నావు.

నా
పాల పొంగుల్ని తిలకిస్తూ
హృద్యంగ పద్యాన్ని వర్ణిస్తూ
శృంగార శ్రీనాథుణ్ణి
సరసాల నీ నాథుణ్ణే అన్నావు.

నా
నవనవోన్మేషణ యౌవనాన్ని స్పృశిస్తూ
కమల నేత్రాలతో కవ్విస్తూ
మరో మన్మథుణ్ణి
మది ఉన్నవాణ్ణి అన్నావు.

అయినా నాకు అపనమ్మకమే!
ఎందుకో తెలుసా?

నన్ను
కానలకు పంపించి
కల్యాణ రాముడ నంటావేమోనని!
సవతులను తీసుకొచ్చి
శ్రీకృష్ణ భగవానుడ నంటావేమోనని!!



# మనలో మన మాట

-శ్రీ 'రామసూరి'

ఆ గది తలుపు ఎవరూ తట్టకండి
తట్టినా ఎవరో ఒకరు
తెరుస్తారనే ఆశ మాత్రం పెట్టుకోకండి

ఎంత గొంతుక చించుకున్నా
ఎంత గట్టిగా బాదుతున్నా
తలుపులు తెరవలేదన్న కోపంతో.
తలుపులు పగలగొట్టే
ప్రయత్నం మాత్రం చేయకండి

అసలు ఆ గదిలో ఎవరున్నారో
ఏం చేస్తున్నారో
ఆరా మాత్రం తీయకండి

ఇంతకీ ఆ గదిలో ఎవరున్నారో తెలుసా?
ఆ గది తలుపులు ఎందుకు మూసుకున్నాయో తెలుసా?

తలుపులకి తాళాలు వేసుకుని
తాళం చేతులు పారేసుకున్నాం కనక.
వెతికే ఓపిక లేక
పారేసిన నెపం ఒకరిమీంచి మరొకరి మీదికి
నెట్టేస్తున్నాం కనక.

వెర్రివాళ్ళలా తలుపులు బాదూతూనే ఉంటాం
గొంతుకలు చించుకుంటూనే ఉంటాం
లోపల్నించి
ఏదైనా పలికితేనే కదా!

ఆ తలుపులు విడేదీ
మనకి మనం అర్థమయేదీ !!!



# వెలుగు

– డా॥ దాశరథుల బాలయ్య

ఎంతెంతో వేగం – ఈ కాల గమనం
ఎందాక నీవు సాగించావు పయనం?

ఎంతెంతో మధురం – ఈ కావ్య రచనం
ఎన్నెన్ని కృతులు వెలయించావు సొంతం?

ఎంతో విశాలం – ఈ సృష్టి వలయం
ఎన్ని లోకాలు విహరించె నీ హృదయం ?

ఎంతెంతో శోకం – జీవిత సమస్తం
ఎంత కన్నీరు తుడిచేసె నీ హస్తం?

ఎంతెంతో తిమిరం – ఈ జగతి సర్వం
ఎన్ని వెలుగులను ప్రసరించె నీ నయనం??



# రెండు కవితలు

–కె. కిశోరు బాబు

## 1. ఈ వాన చినుకుగాడు

నేలతల్లి రొమ్ములు పత్తెలు వాయగొడుతున్నాడు
చెట్ల చెల్లెండ్ర తలలు దిగ్గొరుగుతున్నాడు
పిట్ట పిల్లల గొంతుల తడారగొడుతున్నాడు
చెఱువుల చెలికాండ్ర నోళ్ళు ఎండబెడుతున్నాడు
రైతన్నల డొక్కలు లోనికి పోగొడుతున్నాడు
మూగ జీవాలయిన గొడ్ల పొట్టలకు
గడ్డి మిగల్చకుండా చేస్తున్నాడు
మీసాల మొనగాడయిన దేశం దేశానికే
హడలు పుట్టిస్తున్నాడు.

చిక్కకుండా దొరకకుండా
తప్పించుకు తిరుగుతున్నాడు
బద్మాషుల్లో షరీకయి పోయినాడు
ఈ వాన చినుకుగాడు!

## 2. డాక్టరు సూర్యనారాయణ

చీకటి రోగం సోకిన
తూర్పు కాంతకు
అరుణం అను మహిమాన్వితమైన
మందును రుద్ది
కాంతిగంగగా కలకలలాడింప జేస్తుంటాడు!

చీకటిరోగం సోకబోతున్న
పడమటి చెలియకు
ముందు జాగ్రత్త చర్యగా
అరుణం అను మహిమాన్వితమైన
మందును రుద్ది
'శ్యామలాంబ'గా మార్చి, రక్షిస్తూ
ఆమె చెంతనే విశ్రమిస్తుంటాడు.

ఉభయ సంధ్యలందు ఇలా
నిస్వార్థ ప్రజ్ఞతో
పాటు పడుతూనే ఉంటాడు!



# నీటికి కష్టమై ...

–ఆచార్య ఫణీంద్ర

'నీటికి కష్టమై కనుల నీరిడు కాలము దాపురించె! ఏ
నాటికి తీరునో వెతలు నా' కని ఏడ్చెడు నాదు భార్య క
న్నీటిని మాపువేళ ఇదె నేటికి వచ్చెను, నాదు భాగ్యమై
మూటెడు డబ్బు చేతికిని ముట్టెను జీతపు పాత బాకియై. 1

గొట్టపు బావి యొకటి నే
కొట్టించెదనంచు పలుక, కోమలి హృదిలో
పుట్టెడు సంతోషముతో
పెట్టెను బుగ్గలను ముద్దు ప్రేమ కురియుచున్. 2

మంచి దినము జూచి, మాటాడి యంత్రమున్.
పొలతి తోడ గూడి పూజ చేసి,
ఇంటి కొక్క ప్రక్క ఈశాన్యమున, ఊట
కూపమపుడు త్రవ్వగోరినాను. 3

మట్టి గంగగా మార్చెడు మంత్రగాడు -
దాహమును తీర్ప వచ్చిన తంత్రగాడు -
అభినవ భగీరథుండగు యంత్రగాడు -
మహిని దింపగా మొదలిడె మరను త్రిప్పి - 4

'గిరగిర' తిరుగుచు చొరబడె
త్వరితంబుగ తొలచుచు మర ధరణీ తలమున్
అరి భంజనకై 'సురసుర'
హరి కరమును వీడి చక్ర మరిగెడు కరణిన్. 5

తడి తడి మట్టి ముద్దలను తన్నుచు, గ్రక్కుచునుండ యంత్రమున్;
పొడి పొడి నాదుమోవి తడి పుట్టుచు నుండెను కోర్కె మీరుచున్
పడి పడి చూచు చుంటినట, ప్రాప్తమదెప్పుడటంచు నార్తియై -
'పడునది ! ఏల తొందర' ని ప్రక్కకు త్రోసెను కార్యదీక్షుడే. 6

తడి మట్టి వచ్చి, వచ్చియు
కడకది, మా ఖర్మయేమొ! కనుమరుగగుచున్
పొడి మట్టి బయల్వెడలెను -
దడ పుట్టెను నాకు హృదిని దరిశింపంగన్ 7

'ఏమండీ ! ఇది యేమి శాప'మని నా యిల్లాలు బెంబేలుగా
భూమాతన్ మనసార మ్రొక్కె దయకై ఘోరంచు రోదించుచున్-

'ఏమీ బేలతనం' బటంచు సతితో నేనెంత యోదార్చినన్,
'ఏమో! ఏమగునో!' యటంచు మదిలో నెంతైన సందేహమే! 8

సంశయించి నటులె సగములో మరనాపి,
జలము లేదంటంచు తెలిపె నతడు.
'ఇంత ఖర్చు చేసి, ఇది యేమి నాయనా!
ముందుకేగు' మంచు మొరను బెట్ట - 9

'పడిన దొంక పెద్ద బండయె!
పడలేమిక ముందుకేగి బాధల యందున్ -
పడదిట జలమిక! తెలియుడు !
పడదొంకచో! పోదు మిడిన పైకం' బనియెన్. 10

బండ పడెను త్రవ్వు బావిలోనే కాదు
బండ పడెను నాదు గుండెలోన -
దాహ మారునటంచు తలచిన కులపత్ని
దాహమధికమయ్యె గొంతులోన -
దక్కక, దక్కక దక్కిన దనుకున్న
ధనమెల్ల కరగెను ధరణిలోన -
గొంతును తడుపుటే గొంతెమ కోర్కెయై
చతికిల బడితిని బ్రతుకులోన -

బిక్క మొగము వేసి, బేలగా నావైపు
భార్య చూడ నాకు బాధ కలిగి,
ఆమె దప్పి తీర్ప నసమర్థుడ నటంచు
తలచి దించుకొంటి తలను నేను. 11

నీటికి కష్టమై, కనుల నీరిడు కర్మము వీడదాయె - క
న్నీటికి మాత్రమే కొరత నిత్యము, సత్యము ! లేకపోయె - మా
బోటుల మధ్యవర్గముల పూడిన గొంతులు పూడు నూతులే !
ఏటికి ఈ ప్రభుత్వములు? ఎన్నడు కన్నులు విప్ప నేర్చునో ? 12



మహా సహస్రావధాని

# డా॥ గరికిపాటి నరసింహారావు

## 1. 'కార్గిల్లి' కజ్జాలు

చ. అటజని కాంచుడొక్కపరి అంబర చుంబి శిరస్సర ద్విశం
కట చటులాగ్ని గోళ లయకాల పరిస్ఫుర దంత కార్భటిన్
నిటల నటత్ త్రినేత్రులను నిర్జిత పర్వత పుండరీకులన్
పటుతర ధర్మవీర పరివార కఠోర కుఠార ధారలన్. 1

ఉ. పెట్టని కోటలంట! నిలబెట్టిన జాతిప్రతిష్ఠలంట! ఆ
నట్టువ రేడు గౌరికయి నాట్యము చేసెడి గుట్టలంట! ఎ
ప్పట్టున చూడు మౌనులు తపంబొనరించెడి దిట్టలంట! నే
డట్టి హిమాలయంబు లహహా! చొరబాట్లుకు లొంగి పోవుటా! 2

మ. చొరబాటో పొరబాటొ కాదది, వృథా జోక్యమ్ము, సిమ్లా తిర
స్కరణమ్మే జరిగెన్, సహింపగలమా! కార్గిల్లి కజ్జాలు పె
ట్టిరి; యుద్ధమ్మన భారతీయులకు వండేమ్యాచి, పోరాటమే
జరుగన్ నాలుగునాళ్ళు చాలు, జన పర్జన్యమ్ము గర్జించెడిన్. 3

మ. గీతను దాటకూడదట! గీతలు మూతలు లెక్క చేయకే
పీతల వోలె పాకి జనపీడన చేయు కసాయి సైనికుల్
గీతను దాటనచ్చునట! గీతను దాటగబోము, కృష్ణ హృ
ద్గీతను దాటబోము, రణగీతము పాడెద మింక శాంతికై. 4

ఉ. బస్సున వ్రాసుకొన్న సిలబస్సులు బోధన చేయకుండనే
తుస్సుమటంచు పోయినవి, దుష్టనవాజులు, తీవ్రవాదులున్,
కస్సుమటంచు సైనిక నికాయము రాజ్యము లేలు చోట ఛం
దస్సుల వాజపేయి కవితల్ చెవి కెక్కునె! మాట దక్కునే! 5

శా. అంధుల్ వారలు, మాటిమాటికిని జీహాద్దంచు దండెత్తు గ
ర్వాంధుల్ వారలు, సంతకమ్ములును ఒప్పందమ్ములున్ బుగ్గిపాల్!

సంధుల్ రంధులు రాయబారములు చర్చల్ వారితోనా వృథా,
సంధానింపుడు భారతీయ జనతా శస్త్రమ్ము లాహోరుపై! 6

శా. అణ్వస్త్రమ్ముల వేయబోదురట, అబ్బా! రెండు మార్లప్పుడే
రేణ్వాకారము లైన ఘట్టములు గుర్తేలేనివైపోయెనా!
అణ్వస్త్రమ్ములు భారతీయులకు లేవా! వేయలేమా! సదా
కణ్వాస్థానము మాదు చిత్తము రణాక్రాంతంబు నేడయ్యెడిన్. 7

మ. మరణాంతమ్ములు వైరముల్ మనకు రామప్రోక్త ధర్మంబులౌ
స్మరణీయమ్ముల వీర సైనికుల జన్మత్యాగముల్ వార లె
వ్వరి వారైనను పూజ్యు, లట్టి భటులన్ బంధించి క్రూరంబుగా
చరణంబుల్ నయనమ్ములున్ నరకుటల్ సంధింపగా పంపుటల్. 8

ఉ. భార్యల పిల్లలన్ విడచి స్వర్గము చేరిరి, 'పద్మపాణి ఆ
చార్య' 'రవి ప్రసాదులు'ను సైనిక సోదరులెందరెందరో
శౌర్యము చూపి పాకుజన చౌర్యము నాపుడు, దేశసేవ స్వీ
కార్య మవార్య కార్యమగు కార్గిలు మార్గము చేరుడందరున్. 9

సీ. ఇది అశోకుడు రాజ్యమేలిన భూమియే
ఇది చంద్రగుప్తుని హృదయ సీమ
ఇది గౌతముని ధర్మమినుమడించిన
ఇది రాక్షస క్రీడ కింగలంబు
ఇది గాంధి పాదాల కెరగు శాంతి నివాస
మిది భగత్సింగుని ఎద ఫిరంగి
ఇది పంచశీల పుట్టింటి పేరంటమ్ము
ఇది వృథా జోక్యాల ఎదను చిచ్చు

గీ. వేల సంవత్సరాల శౌర్యాల నేల
ప్రక్క బల్లాల పోట్లకు బద్ధలగునె!
సేతు శీతా చలమ్ములు చేయి కలుపు!
దుష్ట శాత్రవులను బట్టి దుమ్ము దులుపు!!

## 2. ఆంధ్రమాత

ఆకు కూరను తెచ్చి పీకి పాకము పెట్టి
దోరగా వేయించు నోరమూపు
రోట రుబ్బడి వేళ నోటి నూరగజేసి
లొట్ట వేయించెడి గుట్టురూపు
గుంటూరు కారమ్ము గుమ్మరించి గరిటె
పోపు పెట్టెడివేళ టాపు లేపు
ఉల్లిపాయను జేర్చి ఒక్కొక్క ముద్దనే
మ్రింగుచుండెడివేళ నింగినూపు

తెలుగు వారికి నిలువెల్ల తెలివి నిచ్చు
తెలుగు కవులకు పద్యాల వెలుగు నిచ్చు
తెలుగు తల్లుల వంటింటి కలల పంట
తినుడు గోంగూర పచ్చడి తినుడు మీరు!



## ఒక సౌందర్యం - ఒక విధ్వంసం

-శ్రీ బి.వి.వి. ప్రసాద్

సముద్రాన్ని తవ్వుకొని బైటపడ్డ పురాప్రకృతి తుఫాను
సముద్రం లోంచి దూకిన మహాశక్తి పదఘట్టనకి
భూమి చినుకుపడ్డ పచ్చనాకై వణికింది
భూమీ సముద్రం నేనూ ఆకాశం
ఒకరిలోకి ఒకరం వ్యాపించిపోయాం
ఊగే చెట్లలాగే నాలోని మనిషీ
శతాబ్దాల ముందుకీ వెనుకకీ కదిలిపోయాడు.

తొలి ప్రేలుడుతో విడిపోయిన సమస్తం
బెంగ సుడి తిరిగి ఏకమయే ప్రయత్నమే చేసిందో
రాత్రి నిద్రించే ధాత్రికి వల్లబిలం కలే వచ్చిందో
ప్రాణం హరితం ఇళ్ళూ వేళ్ళూ
మనిషీ పిశాచం పశువూ పక్షీ
ఏకమై అనేకమై విడిపోతూ కలబడుతూ...
తుఫాను ముగిసింది. కన్ను మూసింది.

ఒక కొత్త అల వణికే తీరాన్ని నిమిరింది
కానీ మనిషి నిద్రలో మెలకువలో నెత్తురులో చూపుల్లో
జల శంఖం చుట్టిన వృత్తాల వృత్తాంతాలు గాలి నీడలు

★ ★ ★

భూమి తిరుగుతోంది
గుండ్రంగా తిప్పి వదిలిన పిల్లాడికి కనిపించేంత
స్పష్టంగా మృదువుగా నిదానంగా వేగంగా
ఒక్కలాగే తిరుగుతోంది భూమి
తుఫాను పీడకలతో ఎర్రగా అశాంతిగా నిద్రలేని కన్నులాంటి సూర్యోదయం
మృతుల్ని చూపే కిరణాల మృత్యోదయం
మృతులు
ప్రాణం లేనీ ప్రాణం పోనీ ప్రాణం తీసే మృతులు
చెట్టులాంటి మనిషీ మనిషిలాంటి చెట్టూ
కూలిన వైనాల కన్నీటి చారల విషాద తంత్రులు
ఊరూ శ్మశానం వేరు కాని దుఃఖ పతాకం
చెట్టు కూలిన చోట చెట్టంత శూన్యం
మనిషి చివరి శ్వాస తరువాత
అతను నడచిన నేలంతా సముద్రమంతా
మనిషి భవిష్యత్తంత శూన్యం.

★ ★ ★

తుఫాను శూన్యంలో పాఠాలు వ్రాసి పోయింది
తీరం దాటే తుఫాను ప్రపంచ తీరం దాటి
మనిషి లోకీ కలల్లోకీ జ్వరమై ప్రవేశించి శుభ్రపరచాలి
జ్వరపడ్డ సముద్రం తేరుకుని తీసుకొనే అలల శ్వాసలా
మబ్బుల్లో మళ్ళీ మొలిచిన వెలుగు పచ్చికలా
చెట్లో తిరిగి విచ్చుకున్న పచ్చని కిరణాల్లా
మనిషి కూడా ఇంటినీ, కలల్నీ సరిచేసుకోవాలి
తుఫానుల్తో స్నేహానికీ తుఫానుల్తో యుద్ధానికీ
మనిషి నిలబడ్డ సముద్రం లాంటి నిలువెత్తు తుఫాను కావాలి!!

(నాలుగైదు సంవత్సరాల క్రిందట ఉభయ గోదావరి జిల్లాలలో ముఖ్యంగా కోనసీమలో సంభవించిన పెనుతుఫాను సందర్భంలో వ్రాసిన కవిత. ఇది ఈనాడు ఒరిస్సాలో సంభవించిన భయంకర తుఫానుకు కూడా వర్తిస్తుంది. అందువల్ల 'ఆంధ్రజ్యోతి' వారపత్రిక నుండి తిరిగి ముద్రిస్తున్నాం - సంపాదకుడు)



# కవితా కార్తికము

-శ్రీ 'రసరాజు'

వెలుగు లనేకముల్ గలసి - విశ్వహితైక సమర్చనమ్ముగా
గళములనెత్తి అభ్యుదయగానము సేయుచు సాఁగురీతి - ది
వ్వెలు నడయాడుచుండె జలవీథులలో - ఒక కార్తికానకే
నిలచిన వైభవమ్మిది! పునీతములా రసరమ్య దృశ్యముల్! 1

చలి -పులివోలె మీఁదపడి చంపుచునున్నను సైచి - వాహినీ
జలముల తానమాడి - ఒక సంస్కృతి కంకితమై - అరంటి దొ
ప్పలఁ జిఱుదివ్వెలుంచుచు ప్రవాహమునే వెలిగించుచున్న, అ
మ్మలకు సభక్తికమ్ముగ నమస్సులు! కార్తిక చంద్రికాద్యుతుల్! 2

మలిన మనస్వి యొక్కరుఁడు మాన్యుని దర్శనభాగ్యమంది ని
ర్మలుఁడయి మందహాసమున మంచికి హారతులెత్తినట్లు - పం
కిల జలకాంత కార్తిక సఖిన్ దరిసించి వినిర్మలప్రభల్
చిలుకును గాదె!... కార్తికము చేసిన పూజలకున్ సుమాంజలుల్! 3

తిమిరంబున్ దొలగించి - వెల్గునకు మైత్రీగీతమున్ బాడి - లో
కము కల్యాణపథంబునన్ జనగ నాకాంక్షించి - నే డిమ్మెయిన్
ప్రమదల్ ప్రమ్మిదలందు దివ్వెలయినారల్ 'పుణ్యకార్తీక పూ
ర్ణిమ' వేళన్;...మహిళా ప్రపంచమునకున్ శ్రీరస్తు! సౌభాగ్యముల్! 4

వయసు చిగిర్చి - పచ్చనగు పందిరి క్రింద - వివాహ వేదిపై
ప్రియమెసగంగ శీర్షమును క్రిందికి వంచిన అందమైన క
న్నియవలె పంటచేను రమణీయముగా - వరివెన్ను - కార్తికో
దయమున వంచె! ఈ పుడమి తల్లిగ, తండ్రిగ నింగి, శోభిలన్! 5

విమల మనస్కులై గగనవీథుల నుండి ధరాతలాన పా
దములను మోపు పెద్దలకు దారిని జూపగ నాకసంపు దీ
పముల నలంకరించెదరు - స్వాగతదీప్తులతోడ - దివ్యధా
మము లెసగంగ - కార్తికమాసము సంస్కృతి కానవాలుగా! 6

ఏ కన్నెకోర్కె దీపించెనో - నడయాడె
నా దివ్వె - ఆశాసహస్రములకు
ఏ క్రొత్తకోడలి కెరుపెక్కెనో బుగ్గ
ఆ దివ్వె సిగ్గుతో నడుగులిడెను
ఏ తల్లి వాత్సల్య మింపారెనోయేమొ -
ఆ దివ్వె కదలె నాప్యాయముగను
ఏ అవ్వ ఆశీర్వదించెనో - పదమూనె
నా దివ్వె - నిండిన యనుభవమున

ఎన్ని దివ్వెలు నేడు వాహినులఁదేలి
సాగుచున్నవొ కాంతి మస్తకము లెత్తి -

కార్తికమ్మున నే దివ్వె గాలిపీల్చి
నవ్వునో - దాని బ్రతుకు నందనవనమ్ము ! 7

శివ కేశవుల కభేదము
ప్రవచించుచు - దేవళముల భాసిలు మాసో
త్సవ కార్తికదీపము - మా
నవులకు సమదృష్టి నేర్పి నవకాంతులిడున్ ! 8

కాంతి దరహాసములఁ జిమ్మి - ఎంతదూర
మరుగునో కార్తికజ్యోతి - అంతకంత
సంతసము కల్గు నన్ను విశ్వాసగరిమ
కలికి వెలిగించె నేఁడు వెన్నెలల దివ్వె! 9

సందెచుక్కకు నమస్కారంబు చెల్లించి
　　　　పొట్టదివ్వెకు నూనెపోయు వేళ -
ప్రత్యూషతారకు ప్రణమిల్లి కార్తిక
　　　　జ్యోతిలో చేతనఁజూచువేళ -
అనుఁగు తోఁబుట్టువు హస్తభోజనముతో
　　　　విమల జీవనకాంతి విరియువేళ -
ఆకాశదీపమ్ము లందించు కాటుక
　　　　సౌభాగ్యమహిమను జాటువేళ -

భారతీయాత్మ ఒక మెట్టు పైకిసాగి
విశ్వగళ శంఖమొత్తి దీవించె నిటుల -
కార్తికోత్సవ శ్రీ శుభాకాంక్షలంది
సృష్టి - 'చైతన్యకవిత' రచించుగాక! 10



# శిశిరము

– డా॥ బెజవాడ కోటివీరాచారి

చం॥ శిశిరము వచ్చియున్నదిట, చింతగనున్నది చెట్లకెంతొౘ, నల్
దిశలను జూడగా ప్రకృతి దీప్తులు తగ్గగజేయు చుండెగా
శిశువులు సర్వులెంతయును స్వేదముతో విసుగొందునట్టి దు
ర్దశ మొదలయ్యె నిప్పుడిదె, ప్రాణులొౘకింత తపించు వేడికిన్.

తే. గీ॥ అరయ నారు ఋతులులలొౘ నాఖరుదిది
శిశిరఋతు నామమునను విచ్చేసినాది
కాలచక్రమునకు తుదివేళ యిద్ది
చూడు మీ ప్రకృతి కళలొౘ సుకవి వర్య!

ఉ॥ ఆకులు రాలి మోడులయి అంద విహీనముగా వివస్త్రగా
శొౘకము తోడ నేడ్చుచును శొౘభను వీడి కృశించి నట్లుగా
లొౘకము నందుఁ జెట్లిటుల రూఢముగా శిశిరాన నుండగా
నాకమె యన్న యీ ప్రకృతి నవ్యత వీడెను, వాడె, నెండెగా.

సీ॥ స్నానార్థమునకు వస్త్రాలు వీడినయట్లు
వృక్షాలు పత్రాల విడచివేయు
వేసవిన్ చొౘక్కాలు విప్పిన యట్లుగా
వృక్షాలు పత్రాల విడచివేయు
చినిగిన గుడ్డల చీదరించినయట్లు
వృక్షాలు పత్రాల విడచివేయు
మలిన వస్త్రలను మార్చినయట్లుగా
వృక్షాలు పత్రాల విడచివేయు

తే. గీ॥ పాత యాకుల కల్మష భవము పోవ
నిర్మలత్వము పొందును నిశ్చయముగ

వృక్షముల శాసనంబిదె వినుము సుకవి!
శిశిరమునఁ జూడఁదోఁచు నీ సృష్టిలీల.

సీ॥ ప్రాణవాయువు నిచ్చి ప్రాణుల రక్షించు
పచ్చని యాకులు వచ్చు కొలకు
ఆరోగ్యమందించు నౌషధంబుల నిచ్చు
పచ్చని యాకులు వచ్చు కొలకు
వారిదాల నిలిపి వర్షంబు నందించు
పచ్చని యాకులు వచ్చు కొలకు
నిండుగా చల్లని నీడను జేకూర్చు
పచ్చని యాకులు వచ్చు కొలకు

తే. గీ॥ ముందు రాబోయెడి వసంతమున చిగుర్చ
శిశిరమున నాకులను విసర్జించుచుండు
చెట్ల త్యాగ బుద్ధిని పరీక్షించగాను
విశ్వరక్షణ దృష్టియే విదితమగును.

చం॥ శిశిరము వెళ్ళి పోవుచును చెల్మిని స్వాగతమంచు నెచ్చెలిన్
విశదముగా వసంతమును వేడ్కను రమ్మని వేడునెంతయో
దిశలు మనోజ్ఞమౌ తరుల దివ్య సుమంబుల పత్రశోభతో
దశవిధమౌ కళావిలసితంబుగ నుండగ, నోలలాడగన్.

చం॥ ముసలితనంబు మానవుఁడు పొందిన మాడ్కిని వత్సరంబుకున్
కొసదియనంగ నీ శిశిర గుంఫన కాలమెఱింగి చూడగా
విసుగు నొనర్చు కాలదశ, వేసవి కాది దినంబులేయగున్
మసలు కొనంగ కష్టమగు మానవులీ శిశిరాన నిస్పృహన్.



# రెండు కవితలు

- శ్రీ రంగు సత్యనారాయణ

## 1. పగిలిన క్షణం

రెప్పల్ని చీల్చుకుని
బొట్టు బొట్టుగా కన్నీరు.

మనస్సు తెరమీద
కదిలే జ్ఞాపకాలు.

తెగని అశ్రుధార

'మానేరు' తీరం వెంట
పచార్లు చేస్తున్న ఆత్మ

వినిపిస్తున్న వాయుగానం
రెక్కలాడిస్తున్న గది కిటికి

నీరింకిన కళ్ళతో
మళ్ళీ ఈ లోకం లోకి...

## 2. వేసవి గీతలు

చెట్టు గొడుగున్నా...
నుదుటి మీద చెమట చుక్కలు
పత్తికాయల్లా పగులుతున్నాయ్!

కమురు వాసనేస్తున్న కొట్టం.
మోడు పై ఏడ్చే పూరపిచ్చుకలు.
బీజాన్ని వెతుకుతున్న తల్లిపేగు.

వెలితి అవుతున్న బతుకుగోలెం.
అందని బొక్కెన చేంతాడు.
కొసకి... ఊపిర్ని ముడేసుకోవాలి.

రికార్డుల్లో ఆవిరౌతున్న చిరునామా
కొరివి లేకనే అంటుకునే కాష్ఠం.
వేసవిగీసిన అధివాస్తవిక చిత్రం
విశ్వవిపణిలో అమ్మకానికి సిద్ధం.



# అమ్మ ఆవేదన

– డా॥ రామడుగు వేంకటేశ్వర శర్మ

'అమ్మ పదమ్ము కమ్మన; సుధాశనమైనను దానితోడ సా
మ్యమ్మె? లభించునొక్కొ అది అంగడిలోపల?; నిత్యనూత్న కా
వ్యమ్మె; మరొక్క దైవమెవరైన సమమ్మె'? అటంచు మేటి వా
క్యమ్ముల వల్లెవైచెదరు; గౌరవమిత్తురె అందరమ్మకున్?॥ 1

పమ్మిన పిచ్చిప్రేమ పరవళ్ళులు త్రొక్కగ పెంచినాను; బా
ల్యమ్మున నుండి అందరికి నన్ని యమర్చుచు లాభమెంత మా
త్రమ్మును ఆసచేయక సుతాళిని; నేటికి ఇట్టితల్లి అ
ల్లమ్మును ఆలుబెల్లమయెరా! ఎటు లీ జని తెల్లవారునో?॥ 2

నలుగురు పుత్రులుండిరి; మనంగను వారికి లోటులేదు; నే
నెలనెల డబ్బులొందగల నీటగుపద్ధతి నేర్పరించినా
రెలమిని; నన్ను ఉండుమనియే సుతులందురు; ఏలపెక్కు మా
టలు; బ్రతుకెంతయేని ప్రకటంబుగ కాలను తన్ను బంతియే॥ 3

సుతగృహమందు నుంట మనసో చిరకాలము నాకు?; ఇద్ది నా
సుతులకు కీర్తికాదు; శుభశోభయు కాదు; ఎఱుంగనేర్తు; బా

ధ్యతె; అనురాగ మాధురి రవంతయు సేవల తోచదయ్యె; మూ
కతె సుతునింట; మంచి పనికైనను పిల్వగరానిదాననా?॥ 4

నా కర్మంబిదియంత; ఇంతకును నాన్నా! నీకు బాధేలరా?
సాకుం జెప్పుచునుంటినంచు ఇతరుల్ సంప్రశ్నమున్ జేయ - రే
పో, కాకిప్పుడొ అమ్మ వచ్చునని; నీవున్ నీదు సంసార మే
చీకాకొంద కుగాదులన్ మనర! నీ క్షేమంబె కాంక్షింతురా! 5



## వాన

-శ్రీ బి. శశి

ఉరుముల మెరుపుల
కదిలే మబ్బులు కరి కళేబరాలు
ముసిరే నీడలు కసిరే గాలులు
ఈదురు గాలులు గాదిలి కబుర్లు
కొండ వాలులో గలగలపారే
చెట్లు చేమల శిరసులు తడిపే
కుండపోతగా కురిసే వాన!

చిటపట చినుకుల కులికే వాన!
ఇంటి కప్పుపై నేల వంటిపై
తడి తడి తలపుల చప్పుడు చేసే
చల్లని వాన!
చెప్పక వచ్చే
నెచ్చెలి వాన!!



# వెలుగుకిరణపు విలయతాండవం

-డా॥ బి.వి.యస్. భానుశ్రీ

ఎక్కడో ఎత్తైన శిఖరాలనించి కరిగిన మంచు
స్వేచ్ఛగా, స్వచ్ఛంగా పరుగెడుతూ
ఉత్సాహంతో ఉరుకుతూ
యుగయుగాల ఆనందాన్ని పురివిప్పుతూ
అలల కౌగిలిలో కరిగిపోవాలనే కదిలివస్తుంది.

దానికేం తెలుసు!
అల్లల అలల నవ్వుల వెనక విషసర్పాలు పొంచి ఉంటాయని,
ఒక్కో నీటిబొట్టు వెనక ఒక్కో నిప్పురవ్వ దాగునుంటుందని!

క్షణం సేపయినా విశ్రాంతిలేని గుండె సముద్రం
అలలు అలలుగా బ్రతుకు తీరాన్ని తాకాలని ప్రయత్నిస్తూనే ఉంటుంది.
వెయ్యి వికారాలతో లక్ష ఆకారాలు దాల్చిన మనసు
వెర్రి భ్రమలతో జీవిత భాండంలోని ఒక్కో విషబిందువును
ఆబగా చప్పరిస్తూనే ఉంటుంది.

అణువణువునా అలుముకున్న మౌనానికి పూచిన అగ్నిపుష్పాలు
పెదవిదాటి రాలేని భావాల కల్లోలాన్ని బ్రతుకు గోడలమీద
ఆవేశపు రంగులతో ఆధునికంగా చిత్రిస్తూనే ఉంటాయి.
సముద్ర తీరానికి నడిచొచ్చిన ఓ వెచ్చని పచ్చని జ్ఞాపకం
అలల అంచున జారిపోతున్న వెన్నెల నీడల్లో మాయమవుతుంది
కలలతో పోరాడి పోరాడి ఓ చెట్టు నీడను విశ్రమిస్తుంది అలసిన మనసు.

పచ్చటి పూలు చినుకుచినుకుగా రాలి
లోయంతా మెత్తటి పరుపులు పరుస్తాయి.
అక్కడ శిఖరాగ్రాలకి వ్రేలాడుతున్న మేఘాల
అంతఃపుర అంతర్భాగాలలో
గూడు కట్టుకున్న నైరాశ్యం నెమ్మదిగా రెక్కలు విదిలిస్తుంది.

మనసంతా ఆక్రమించుకున్న శ్మశాన నిశ్శబ్దం
కలలు, కోరికలు, ఆశలు, ఆవేశాలు
కాలి బూడిదవుతున్న శబ్దానికి
అపరాధిలా తలవంచుకుంటుంది.

దేవదారు వృక్షచ్ఛాయల్లోంచి సరుగుడు తోటల్లోకి
నువ్వు నడిచొచ్చిన దారంతా,
నీ గుండెలోంచి జారిన ఒక్కో నెత్తుటి బొట్టు
విరిగిపడ్డ కొండ చరియల క్రింద కొనఊపిరితో కొట్టుకుంటుంది.

ఏ దూర్వాసుడి శాపమో
తన వికృత హస్తాలు చాచి
నా కనుపాపల నిద్రించే
పసిపాపలాంటి నీ రూపాన్ని
అస్పష్ట ఇనుపతెరల వెనక్కి తోసేస్తుంది.

దారుణంగా హత్య చేయబడ్డ ఓ అమాయక హృదయంలోంచి
లేచొచ్చిన లేత ప్రేమమొగ్గ
గరళమై, మరణమై, నిరంతర జ్వలనమై
విశ్వమంతా విలయ తాండవం చేస్తుంది.

కాలాన్ని కూలద్రోసి
శతాబ్దాల నిశ్శబ్ద నిరీక్షణని కొద్ది కొద్దిగా మ్రింగుతున్న
అంతంలేని చీకటిరాత్రిని బ్రద్దలు చేసి
మంచు కురుస్తున్న పర్వత శిఖరాలమీద
రక్త సిక్తమయిన హృదయాలతో మనం కలిసే క్షణాన
భూమి రెండుగా విడిపోతుంది.
గుర్తు తెలియని ప్రదేశాలకి వేరువేరుగా విసిరేస్తుంది.

చావు, బ్రతుకు కాని నిర్వేదావస్థలో
ముంచుతూ తేలుస్తూ
త్రిశంకు స్వర్గంలో వేలాడేస్తుంది!



# ఆకలి బ్రతుకులు

-శ్రీ ఎద్దుల శంకరనారాయణ

గీ॥ బండరాళ్ళను ఛేదించు బడుగు జీవి
గోచిపాతలు రుచిరమౌ గుడ్డలాయె
పూటపూటకు కష్టించు భుక్తి కొరకు
సూర్య కిరణాలు బడుగులఁ జూడగలుగు. 1

గీ॥ చదువు సందెలు లేక విచార వదను
లగుచు దళితులు బ్రతుకరే ఆశలుడిగి
ప్రభుత చేయూత లేకున్న బ్రతుకగలరె?
భాగ్యహీనులు కటకటా! బడుగులిచట. 2

గీ॥ వారమున కొక్క స్నానము బదులు బట్ట
కలదె? కూలి బ్రతుకు; వళ్ళు నలత జెంద
సురను గ్రోలుదురంట యేమరక వారు
పొదుపు మాటలు తెలియవు ప్రొద్దుగ్రుంక. 3

ఉ॥ మాసిన బట్ట గట్టి యవమానము దూరము జేసి రక్కటా!
దోసము వారిదౌనె? ధర దుఃఖము రొక్కము లేమిచేతనే
మీసము మోము కందమట మేలిమి బంగరు రత్న హారముల్
హాసముఁ బెంచు నెంతకును యాతన గూర్చవు ధాన్యసంపదల్ 4

కం॥ బుగ్గల నిగ్గులు తగ్గును
సిగ్గులు వనముల వసించు స్త్రీల బ్రతుకునన్
పెగ్గెలు తగ్గును సతతము
నగ్గలమౌ ఈతిబాధ లంధుని రీతిన్. 5

గీ॥ వంక నీరు త్రావి బ్రతుకంత నీడ్చును
సంకలోని బిడ్డ చంక దిగడు

బంకమట్టి లోన పసివాని యాటలు
క్రికెటు ఆటగాని క్రీడఁదెలుపు. 6

ఆ॥ నలుపు తెలుపు లోకటె నగలన్న తెలియవు
పాయసాల రుచులు పట్ట వెపుడు
ముద్దమ్రింగి నిద్ర మునుగుదు రయ్యహో
భాస్కరుండు పొడువ పనులమాటె. 7

కం॥ జీవన విధాన మిట్టుల
పావన గంగా ప్రవాహ భంగిమ సాగున్
చేవ తరుగును దినదినము
రావణకాష్ఠపు బ్రతుకులు ప్రతిదిన కర్మల్. 8

ఆ॥ గుడిసెలోన నిద్ర గునపాలతో మైత్రి
గోచిపాత జన్మ కొఅత బ్రతుకు
సుందరాంగియైన చుక్కల చారుతో
మెతుకు మ్రింగవలయు మిడిసి పడక. 9

గీ॥ భర్మ్యహర్మ్యముల్ నిర్మించు పనులయందు
పడతి పాలుపంచుకొనుట ప్రగతి పథము
మగువ సాహస కార్యాలు మరువగలమె?
మగువ మాంచాల వెనుకకు మరలె నేడు. 10

గీ॥ సమ సమాజపు భావాలు సుమములైన
భ్రమర గీతాలు సంస్కార పథము దాల్చు
మానవత్వము జాగృతమౌను నిజము
సాత్త్వికానంద మొనగూడు సహనమందు. 11

గీ॥ దళిత జీవన మున్నత స్థాయి పొంద
ధరణి పులకించు దేశము ధన్యతగను
వాఙ్మయముగూడ శోభిల్లు వ్యాప్తిజెంది
కువలయానందకరము నా కవనమెల్ల! 12

# జీవితం

-ఆచార్య పాపిరెడ్డి నరసింహారెడ్డి

జీవితం
కిక్కిరిసిన రైలుపెట్టెలా
ఉక్కిరి బిక్కిరి చేసే
ఉక్కు కౌగిలి బిగింపు కష్టాల్తో...

జీవితం
సువిశాల సుందర ప్రపంచంలా
ఆహ్లాద నందనోద్యానంలా
రూపాయిల ఘల్లు ఘల్లుల్తో
నర్తించే ధనలక్ష్మి కరుణాకటాక్షంతో...

జీవితం
సీత.... ....!
సమస్యల గుండంలో
దుమికి ...
మళ్ళీ
వెలికి....

జీవితం
కష్టాల
సుఖాల
సంఘర్షణా నైరంతర్యంలో
వెలికి ఉరికే నిప్పు ....

('అనుభూతుల పొదరిండ్లు' అనే కవితా సంపుటినుండి)



కొన్ని హైకూలు:

# చినుకులు

-శ్రీ 'సత్తిబాబు'

ఏ పాద స్పర్శకో
నా పద్యం -
ఓ శాపగ్రస్త శిల.

ఏ ఋతువుకీ
స్పందించరు కొందరు -
బస్టాండ్‌లోని బిచ్చగాళ్ళు!

నెమరేస్తున్నపుడే
నిజమైన రుచి -
అవుకు గడ్డి, నాకు గతం.

రాత్రి కొండెక్కి చూస్తే
ఆకాశం
నేలపాలయింది!

వెన్నెట్లో కొబ్బరాకు -
దానిపేరు
కోనసీమ!

చీకటే ఇస్తుంది
వెలుతుర్ని -
దీపానికి!

కొన్ని గుండెల గొంగళీలకు
ఆ దశ
దాటడం తెలియదు.

పుడమి తల
చిక్కుతీస్తూ
తొలి కిరణాల దువ్వెన!

కోతలప్పుడు కాదు హర్షం
నాట్ల ముందు
రావాల్సిన వర్షం.

ఒకదాన్నొకటి
గెలుస్తూనే ఉంటాయి
దివా రాత్రాలు!

రాయి నీవు విసిరితే
కాయ తను విసిరింది -
ఎవరి శైలి వారిది!

సంప్రదాయం కంటే
సనాతనం
ఆకలి!

నెబ్యులా
నేత్రాలకు అందదు -
నైతికంలా.

మన చూపుల వెర్రి
ఓ ముడి ఖనిజం
మెస్మరిజం నాడిఇజం.

తప్పిపోయిన పిల్లాడిపై
తిరనాళ్ళలో
ఒంటరితనం వేట!

కాస్ట్లీ పోవర్టీ
కొందరు
కాస్తోన్న పొయెట్రీ!

స్పృశిస్తోంది నా కపోలాన్ని
లాలనగా -
ఈ ఏటి సాయంకాలం!

ఎంత చల్లగా
చూస్తుంది చెట్టు
స్తన్యం ఇస్తోన్న తల్లిలా!

వాగడం వాడి వృత్తి
తలలూపడం
మన ప్రవృత్తి.

కోడిపెట్ట
రోజుకో పసిగుడ్డు నందించే
దేవకి -

గుప్పెడు అక్షరాలు చాలు -
నేర్చుకోవాల్సింది
పేర్చుకోవడం.

ఆఖర్న దక్కే గుక్కెడు ప్రేమకై
రోజువారీ దోపిడీకి
లొంగే అమ్మ- ఆవు !

మెదడే కాదు
కశ్మల మృత్తికలో
ఏ విత్తనం తలెత్తదు.

నా విశ్రాంతికై
తను అవిశ్రాంతంగా తిరిగే
నాన్నా - నా గదిలో ఫాన్?

నిన్నటి ఊర్పు
నేటి నిట్టూర్పు
రేపటి వడగాడ్పు!

గడ్డి బొమ్మను చూపి
పాలు పితుకుతాం,
బాగా తెల్సు వాడుకోడం.

జారును
బ్రతుకు మెట్లు -
జాగ్రత్త!

ఈ లోకం రూపం
చూడాలంటే
రెప్పల తెర కావాలి

తమస్సుతో
ఎన్ని తుంపరులు త్యాగమో
ఉషస్సులో ఓ మంచు ముత్యం!

ద్రాక్ష గుత్తులు హైకూలు -
పనస చెట్లకి
దానిమ్మ సంపుటాలు

హరివింటి వంతెన
ఓ కన్నీటి బొట్టుకి
కాంతి రేఖను గుచ్చితే

అర్థమయేదాకా ఆగు -
ఎపుడు వేశావని
సమాధానం దొరికే ప్రశ్న?

నా చుట్టూతా పరచుకుంటే
గుర్తు కొచ్చేది
అమ్మ కడుపు గది

రెండు అమానుషాలు -
చెట్టు రెండుగా చీలడం,
నీ నుండి నే వేరవడం.

స్వప్నించడం నేర్చుకో గాఢంగా -
నీ డొక్కల ప్రక్క
రెండు రెక్కలు మొలవాలంటే.

సంగీతానికి సంబరం
శ్రావ్యానికి కాదు -
శ్రవ్యానికి

ముగ్గురు కుర్రాళ్లు అనుకరించే
ముప్పై బోగీల చైతన్యం
అల్పానల్పం నా హైకూ.

పూవు వెనుక
శత్రువు లా -
ముల్లు!

నీ చూపు కంటే
చురుకైనది -
అంధుని స్పర్శ!

కొత్త పెళ్ళి కూతుర్లా
పోతోంది మేక -
జాతరజనం వెనుక

ఇక్కడి మహిళ
తనువు ఇచ్చి
పుచ్చుకొంటోంది.

నాలో
నన్ను తీసేస్తే
అనంతం!

అందిన
ద్రాక్ష
నా హైకూ.

తనోపకారం లాంటి
పరోపకారం
ధనికుడి దానం!

రైలు ముందుకి -
జ్ఞాపకాల చెట్లు
వెనక్కి.

చూపు సాగు దూరంలో
రేగుతున్న పొగ సుడి -
చలికా? చితికా?

సుజాతెప్పుడూ
వన్ బై టూ చేస్తుంది
జ్ఞాపకాల 'టీ' ని!

కాళ్ళక్రింది ఇసుక
లాగేస్తోంది కెరటం -
నీపై మోజులా

గింజకు గుడ్డు
గడ్డికి పాలు -
లాభసాటి బార్టర్!

నింగి దగ్గరౌతుందని
నిచ్చె నెక్కుతున్నా -
నేల దూరమవుతోంది!

(సమాప్తం)



# వెలుతురు చినుకులు

-డా॥ రావూరి భరద్వాజ

మీరు
గమనించారో లేదో
వెన్నెల రాత్రులలో
ఏవూరి చెరువులో నయినా
వెండి కత్తులు
తేలుతూ, మునుగుతూ ఉంటాయి. 1

''హోరెత్తిపోతున్న ఆ బృందగానాన్ని
కాసేపు ఆపమని చెప్పరాదా?''
అన్నాడతను ఆమే కేసి చూస్తూ.
''నేను చెబితే మాత్రం,
వాన వింటుందా కన్నా'' అన్నదామె, కిటికీలు మూస్తూ. 2

నేనో చూపు నవుతాను -
ఎప్పుడూ నీ నేత్రాలలో ఉండి పోవడానికి!
నేనో నవ్వు నవుతాను -
ఎప్పుడూ నీ పెదవులపై ఉండి పోవడానికి!
నేనో నీడనవుతాను -
ఎప్పుడూ నిన్ననుసరిస్తూ ఉండడానికి!
నేనో ఊహనవుతాను -
ఎప్పుడూ నీ అంతరాల్లో ఉండడానికి! 3

''మీకు
చిటికెడంత ఓర్పు నిద్దామనీ,
పిడికెడంత ధైర్యమిద్దామనీ,
వెలుగుతున్నాను గానీ;
సరదా కోసమూ గాదు,

నా గొప్ప చెప్పుకోవడం కోసమూ కాదు''
అన్నదా చిరుదీపం,
తన చుట్టూ చిక్కగా ముసిరిన
ముదురు చీకట్లతో. 4

అబద్ధాలాడడం తెలీని వాణ్ని కాదుగానీ,
ఇప్పుడు మాత్రం నిజమే చెబుతున్నాను.
నా మాట మీద నమ్మకం లేకపోతే,
ఒక్కసారి అలా చూడండి!
ఇది – చాలా పేద చెరువు.
అందుకే
చలికి తాళలేక
చిల్లులు పడిన మబ్బు దుప్పటిని
కప్పుకొంది పాపం! 5

రంగు రంగుల పిట్టలు
ఎక్కడెక్కణ్నించి ఎగిరొచ్చి
ఎప్పుడా చెట్టుమీద వాలాయో నాకు తెలీదు.
పలకరింతామని దగ్గరకెళ్ళాను.
అవన్నీ పూవులయి కొమ్మలకు అతుక్కుపోయాయి! 6

చెట్టు వణకడం లేదు.
దాని కొమ్మలూ రెమ్మలూ
అసలే కదలడం లేదు
కానీ
చెరువుపయి వాలిన చెట్టు నీడమాత్రం,
అల్లల్లాడిపోతున్నది;
అలలు బెదిరించాయో,
చేపలు కోప్పడ్డాయో
నాకు తెలీదు. 7

నలకలు కూడా ఎగురుతాయనీ,
మెరుస్తాయనీ;
ఎగురుతూ మెరుస్తాయనీ;
మెరుస్తూ ఎగురుతాయనీ
మిణుగురుల్ని చూసిందాకా, నాకు తెలియనే తెలీదు! 8

నీటి మోకుల సహాయంతో
నేల తల్లిని తమ వేపు లాక్కోవాలని
కారుమబ్బులూ,
ఆ మేఘాలనే
ఆ నీళ్ళ తాళ్ళతోనే
తన వేపు లాక్కోవాలని
నేల తల్లిగారూ,
ఈ వర్షాకాలమంతా
పెనుగులాడుతూనే ఉన్నారు! 9

నిన్న
పడమటి కొండల వెనక
కూరుకుపోయిన సాయంసంధ్య -
ఇవ్వాళ
తూరుపు గట్టున
ఉదయ సంధ్యగా మొలిచింది! 10

తొలికోడి కూసినప్పుడూ
చుక్క పొడిచినప్పుడూ
నేను మేలు కొంటాను.
కానీ
నా నీడమాత్రం,
సూర్యోదయ మయిందాకా,
ఎక్కడో నిద్రపోతూనే ఉంటుంది! 11

ఆ కాలిబాటకు
ఆ పక్కనా ఈ పక్కనా ఉన్న
గడ్డిపోచలన్నీ
రంగు రంగుల పూల తలలను
బాట మీదకి
భక్తితో వాల్చాయి-
మరి కొంచెం సేపట్లో
ఈ తోవనే రానున్న
ఆ బంగారు తల్లి
పాదాలు
కందిపోకుండా! 12

*(1999 జూన్ నెలలో ప్రచురింపబడిన ''వెలుతురు చినుకులు'' కావ్యం నుండి)*



ధారావాహిక కవిత:

# మల్లీ! ఓ మల్లీ!

(జానపద శృంగార పద్యకావ్యం)

-శ్రీ జి. సుబ్రహ్మణ్య శాస్త్రి

ముందుమొఱ:

రాయలసీమలోన ఒక రప్పలగుట్టల మారుమూల ప
ల్లేయన వచ్చు; అక్కడనె లేమికి కల్మికి మద్దెనున్న ఓ
రాయడిగారి యిల్లు; మఱి రాయడు పోయెను, ఆవిడొక్కతే;
ఆయను పోరగాని వలపల్లిన సిత్రమె ఈ కతంతయున్. 1

కతలో ఇసేసమేమీ
ఎతికిన కనబడదు; కాని, ఎద కదిలించే
సుతిమెత్తని తెలుగు వలపు
కతలే కనిపించు; సదువగా మొఱనిడుదున్. 2

మన తెలుగులోన పద్దెం
బును మనమాటల్తొ వలపు పుట్టగ సెప్పం
గను వచ్చని తెలుపుట కీ
సినవాని జతనము; ఇడుడు సిత్తము నాపై. 3

వలపుకత మొదలు:

పిల్లా! కేసి కెనాలు కాడ తొలిమార్పేరెట్టి నన్పిల్సినా
వల్లా తోడని సెప్పినా వపుడు; బావా! పేనమన్నావు; న
న్మల్లారే! మనువాడతానని మజామాటల్ పిటారించినావ్!
మల్లీ! బంగరు బంతిపూవ! మరువమ్మా! నిన్ను మర్సేదెలా? 4

మఱునాడక్కడ సంతలోన మఱి నామానాన నేనుంటె, ఓ
మరుమల్లీ! నువు అమ్మతో నడిసి సిన్మాపోతు కన్సైగతో
సురసుర్ సూస్తివి రమ్మనట్లు, మఱి ఓసోసే గిరాట్ కొట్టె, నా
బరిలో నిల్వగ లేకపోతి, నడిసే వాటమ్ము కూసాడనే! 5

నీ మీదొట్టు! మఱేమొ మల్లి! నిదరే నింసమ్ము లేదాయె, నా
కామద్దెల్ నిసిరేయి దాక కలలో కన్పించినావే పిలా!
రామంటావు, తటాల్ని పోమని బలే రాగాలు తీస్తావు; నా
కేమో నీపయి అట్లెదొర్లి పయిపై కిస్సాడ బుద్దౌతదే! 6

కసిగా బుగ్గలు గిల్లి నీ మొగము నా కౌగిల్లొ తొక్కేసి బల్
రుసిగా ముద్దులు గుప్పి సంబ్రపడి నోరూరంగ నామల్లి ఎం
తొ సివాలాడి పరాసికాల్పలికి సంతోసాన మోరెత్త, దీన్
తసదియ్యా తల కోడుదాకి కల అంతా సెద్రి నవ్వొచ్చెనే! 7

అయితేనేమిలె పిల్ల! సక్కని కలేగా! సత్తెమవ్వాలనే!
మయికమ్మెక్కువ కాక ముందె మనువో, మాతంగమో, రంగమో
అయిపోవాలనె మల్లి! లేకపాతె నా ఆరాటమింతౌతదే
సయిదోల్లందరు ఎక్కిరిస్తరు, కులాసా లాడించి కుమ్మేస్తరే! 8

నా మగతమ్మ సూపను గనమ్ముగ వున్నదదేందె మల్లి? నీ
తో మనువాడి నీ కడుపు దూర్స్నొక కందుని పైకితీసి నా
దోమలగుంపు నేస్తులకు దొబ్బిన మాద్రిగ సూపవద్ద? అ
ట్లా మలవాలెగాదె కత? టక్కులమల్లి! అనుగ్గరింపవే! 9

గుర్తుందా ఒకనాడు పూవుల జమాల్ గుల్జాల పైతోటలో
పర్తుంటే నినుపట్టినాను, పయిటన్ పైసర్ది నీల్ జల్లినాన్
అర్తుంటే పరలేదులే మడిసి నే నన్నాను నామల్లి! నీ
ఆర్తంటే దిగులే, మరేమొ అన లేమంటావె నేనంటెనో? 10

కొంచెం కూ డబిమానముందె పడుసా! కోపిస్తవా? వస్తవా?
కంచంలో బువ నీకు నాకు అని మాగాయున్ మసాలన్నమున్
ఎంచక్కా కలగల్పి పెట్టితిన? నీ కెంతిష్టమో మల్లి! నా
క్కొంచెం కూడ మిగల్సకుండ తిని నా కోర్కెన్ నిరాసిస్తవే! 11

మతిసేస్కోవె కుశాలదాన! సిరసాల్ మల్లయ్య తిర్నాలలో
జతగాజుల్ కొనియిస్తినా? ముదురనాసాపండు నేచ్చిర దాం
జత జాకిట్టును తీస్తినా? వలపుగుంజా! నవ్వి పండిస్తివే!
కుతి తీరింద? అదేమి మల్లి! మొగ మాకోతక్కలా పెడ్తవే! 12

సరదాగా జతకట్టి జాగరణలో సయ్యాట లాడాము; నా
సరసన్ సూసిన వాల్లకంత యిది నా సైదోడు పెల్లామె పో
మరి అన్నంతగ పూసినావు, ఇపుడో? మర్యాద రామక్కవై
మరిసావే నను మల్లి! నీకు తగునే? మాటాడి పోరాదటే! 13

అమ్మానాన్నలు వొప్పుకొన్నరిక మావా! మల్లి నీదైందిపో
సెమ్మా సెక్కలు కోలటాలు తిరునాల్ సెయ్‌లోన సెయ్యేసి నీ
దిమ్మద్రంగ పసార్లు సేతమని, ఓ! తియ్ తియ్య మాట్లాడి, నీ
యమ్మా! ఇప్పుడిదేమె మల్లి! ఎగతాలాటల్ బలాడిస్తివే! 14

మతిసేస్కోవె మరందలో గుడిలో గమ్మత్తుల్ కిలారింత లా
మతి లేనోడు పూజారి బాపనయతో మల్లీ! మజాకాల్, బలే!
అతిగా వాగిన కూతలెన్ని? తసదియ్యా! మర్సినావే పిలా!
జత నీతోనె సుమా! నువే కనక పో సావంటె నే సస్తనే! 15

మన మానంది రదోస్తవంలో నువు నేన్ మన్సార తేరిగ్గలా?
జనమేమందె మతుండదా? సిలకతో జంటైన గువ్వంటు న
వ్విన తీరేందె? బుటాజరీ పయిట మాసిందంచు పైరైక తీ
సిన నా కర్సు విసేసమేందిపుడు సీసీ! మల్లి పొమ్మంటవే! 16

గాజులపల్లి రస్తకడ గంటయ ఓటలుకాడ ఇడ్లు మా
మోజుగ తింటివే! గురుత? మూగి ముసంగి సివంగి మల్లి! సన్
జాజులు మూరమూర ముడి సంతగ నవ్వితె గుర్తె? ఓసి నా
రోజులు బాగ లేవనె ఇరుద్దము సేస్తవు నాయటంటవే? 17

వస్తానంటవు, రానెరావు, మరుపూవా! బాణమై గుండెలో
రస్తాసేస్తవు తొల్సి పెడ్తవు మహా రాపాడ్తవే మల్లి! నా
పస్తాయింపును సూడవేమె అలుసా? పానాన్కి పానమ్ముగా
సూస్తానంటిని కాదె, కోర్కి తెలిపే! సూరల్గ అందిస్తనే! 18

అన్నట్లిప్పుడు గుర్తు వస్తది, మరే ఆరోజు ఏకాసి నా
డన్నాతమ్ములతో గబాల్న నడిరేయాలంట మాయింట దా
క్కొన్నారోసి గదే! కుశాల్కి; కసిగా కాల్తొక్కి ముద్దెట్టి నీ
వన్నావప్పుడు మల్లి! నీవె గురియం టామాట లేమయ్యెనే? 19

బావా! నీవె గతన్నమాట విరిపూవా! మర్సినావా? ఎదో
లే, వాగానని సెప్తవా? మరదలా! లేతాకు నాగుండె, నీ
దోవల్ తప్పిన మాటలొద్దు, నను నీతో సేర్సికోవే పిలా!
బావా మర్దలి పొందు ఇందు కదవే! బాసాడవే మల్లికా! 20

ఇంకా సెప్తను పెద్దగా యినవె, పల్లెంకయ్య పూదోటలో
వంకాయల్ నునుపాలుగడ్డలతొ నీవా బుగ్గెముల్ సేస్తివా?
వంకర్ టింకర మూతిపెట్టితివ? ఆవంకెత్తి నే ముద్దులన్
సంకల్బట్టి బిగెత్తి పెట్టితిన! నీ సంబ్రమ్ము మల్లీ! బలే! 21

(ఇంకా ఉంది)

అనువాద కవిత:

# 'దాంపత్య గీత'

-డా॥ సుమతీంద్ర నాడిగ

సఖీ!
నిన్ను చూసిన నాటి వరుడు నీకు జ్ఞాపకమున్నాడా?
ఎలాగుండేది అతని చహరా?
ఎప్పుడూ నీ పహరాలో గడిపేవాడు
నీ పుట్టింటి నుంచి నిన్ను విడదీశాడు.
నీ వారిని మరిపించాడు, క్రొత్తలోకం చూపించాడు
ముద్దు ముత్యాలవాన కురిపించాడు
ఎక్కడికి పోయాడతడు నీ జతనున్నవాడు?
సప్తపదిలోని నీ నెచ్చెలికాడు?

తొలినాటి ఆ భావకంపన ఎక్కడ? రోమాంచ మెక్కడ?
స్ఫూర్తి, ఉద్వేగ మెక్కడ? గుసగుసలాడినా చాలు
గురుతుపట్టే ఆ చురుకెక్కడ? మాట మాటకు కన్న
ఆ మురిప మెక్కడ? బెసగిన మాటే లేదక్కడ!
ఒక్కటైన భావమొక్కటే అక్కడ; భావగీతపు బ్రతుకు
మెరుపు చందమయింది, విద్యుత్తు చీకటిని మింగివేసింది
పెదాల చిప్పలు తెరిస్తే మాటలు ముత్యాలయ్యాయి
ముత్యాల పానుపూ అతి మెత్తనయ్యింది.

అలలు మనకు ఉయ్యాల, నురగలే మేఘాలు
హోరు గగనాన్ని సోకుతూంటే
నీటిలో దొరికావే నా అప్సరా! నీవు,
జలచరులమై మనం విహరించాము;
గాలిలో ఎగిరాము, రెక్కలు విసిరాము,
ముక్కుముక్కుకు చేర్చి ముద్దులాడాము
గూటిని సింగారించి కొత్తపాట పాడాము

గుడ్డు, పిల్లలగన్నాము; గుటకేయించాము.
ఎన్నాళ్ళు ఇలాగో! కాలం పరుగెట్టింది
ఎక్కడికి పోయాం మనం అప్పటి వాళ్ళం?
తరుణ జంటల చూసి మనమే వారిగా
ఇప్పుడనుకుంటే, మనం నిన్నటివాళ్ళం!
రా అటు చూద్దాం, పార్కు బీముల్లోన
రతీమన్మథులను, సీతారాములను,
మత్స్యయంత్రం గెల్చిన అర్జునుని చూద్దాం
పాండవుల వరించిన ద్రౌపదిని చూద్దాం.

అక్కడ గుమిగూడుతున్నారు రంభ ఊర్వశులు చూడు
అదిగో అక్కడే యక్ష కిన్నరులు
అక్కడే ఉంది తార, వాలి పడతి
సుగ్రీవు పక్షానికి జారిపోతోంది;
ఏదో ఓ నాటికి మన మదృశ్యమైనా
సంపూర్ణ నాశం మనకు లేదంటున్నా!
ఎవరి ఊపిరినో చేరి, ఎవరి కడుపులోనో దూరి
గరికలోనో, బురదలోనో పుడతాం మనం.

విటమన్ అన్నట్లు బూటుకాలి అడుగున
గడ్డిపోచగా మనం కానరావచ్చు.
ధాన్యంలో, మాన్యంలో, చేపల్లో, తేపల్లో
కాడులో, నాడులో ఎక్కడో దొరకవచ్చు;
నేనెక్కడో, నీవెక్కడో, పంపకమ్మై పోవచ్చు,
తిరిగి తిరిగి గుర్తుపట్టి కలవనూ వచ్చు,
మళ్ళీ ఓసారి నీ ఎదుట కొత్త కాలమానాన్ని
తగ్గ కొత్త గీతాన్ని పాడనూ వచ్చు!

(కన్నడం నుండి అనువాదం: ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ)



# భజ గోవిందం! భజ గోవిందం!

(శ్రీ శంకర భగవత్పాదుల భజగోవింద శ్లోకములకు తెలుగు గీత పద్యాలు)

(గతసంచిక తరువాయి)

-శ్రీ ఇ. వరదారెడ్డి

ఎదుట కుంపటి పిఱుదను నెండగాయ
నిశను మోకాళ్ళ చుబుకంబు నిలిపి చలికి;
భిక్ష మఱచేతిలో దిని వృక్షమూల
వాసమున్నను నరునాశ వదలిపోదు॥ 16

సంద్రమందును గంగను స్నానమాడి
మేటివ్రత దానశీలియై మించుగాక
జ్ఞానహీనుడు మఱి నూరు జన్మలకును
ముక్తి బొందంగ జాలడే యుక్తినైన ॥ 17

దేవళంబుల తరుమూలదేశ వాసి
అజినధారియు భూమిశయ్యాగతుండు
సర్వ వస్తూపయోగ విసర్జనుండు
నగు విరాగికి కలుగదే అమిత సుఖము? 18

యోగరతుడైన సర్వత్ర భోగియైన
సంగ సంతోషియైన నిస్సంగుడైన
ఎవని చిత్తము బ్రహ్మమందే రమించు
నతడె యానంద మత్యంత మనుభవించు ॥ 19

అలతియైనను గీతార్థ మరయు నతడు
విమల గంగా లవంబు సేవించు నతడు
ఇంచుకైన మురారి నర్చించు నతడు
యముని గూర్చి భయంపడ డంత్యదశను ॥ 20

ఇలను జన్మంబు మృతియు నా వృత్తులగును
మాతృజఠరస్థ గతియగు మరల మరల
దుస్తరంబగు సంసార తోయధియును
పాహి, రక్షింపు, హరి, యపార కృపను ॥ 21

చింపి గుడ్డల యతుకుల చేల తోడ
పాప పుణ్య వివర్జిత పథము నందు
యోగ సంలగ్న చిత్తుడై యున్న యతడు
శిశువొ, యున్మత్తుడోయన చెలగుచుండు ॥ 22

ఎవరమో నీవు నేనును? ఎచటి వాడ
నరయ తల్లియు దండ్రియు ననగ నెవరొ?
అని వితర్కించి నిస్సారమైన స్వప్న
సదృశలోకంబు త్యజియించి శాంతి గనుము ॥ 23

విశ్వమును నీవు నేనును విష్ణుమయమె
అసహన జనిత కోపమ్ము వ్యర్థమగును
సర్వవేళల సమచిత్త సరళినుండి
సత్వరమె విష్ణుజేరు నాసక్తి గొనుము ॥ 24

పుత్ర, బాంధవ, శాత్రవ, మిత్రులందు
వలదు పూనంగ స్నేహంబు వైరమేని
ఆత్మ దర్శన మొనరింపు మందఱియెడ
వీడు మజ్ఞానజంబైన భేదబుద్ధి ॥ 25

కామ క్రోధాది శత్రువర్గమునుద్రుంచి
ఆత్మలోననె పరమాత్మ నరయ వలయు
ఆత్మ విజ్ఞానహీనులైనట్టి మూఢు
లనుభవించెదరు నరకయాతనముల ॥ 26

విష్ణు నామార్చనము, గీత, వినుతిజేసి
శ్రీ పతీరూప ధ్యానమ్ము జేయుమెపుడు

చిత్తమును సజ్జనావళి చెంత జేర్చు
దీన జనులకె ధనమును దానమిమ్ము ॥ 27

జనుడు సుఖ భోగముల లాలసతను జెంది
వయసు మళ్ళిన రుగ్మతల్ పైకొనంగ
మరణమే లోకమున తుది శరణమయ్యు
పాపకార్యాచరణమును బాయకుండు ॥ 28

ధన మతియనర్థదాయకమని తెలియుము
ధనముచే నాస్తి సుఖము సుంతయును నిజము
తనయు జూచియు భీతిల్లు ధనికు డెపుడు
ఇదియె యైశ్వర్యరీతి యెల్లెడల జూవె॥ 29

శ్వాసబంధన మింద్రియ సంయమనము
నిత్యము లనిత్యముల గూర్చి నిర్ణయంబు
జపసమేత సమాధి నిష్ఠయును గలిగి
మిగుల యవధాన చిత్తుడై మెలగవలయు ॥ 30

గురు చరణ కంజ భక్తి తత్పరుడవగుచు
అచిర సంసారముక్తుడవై తరించి
నియమితేంద్రియ మానస నియతినుండి
హృదయవాసి దైవమును దర్శింపగలవు ॥ 31

(సమాప్తము)

అయ్యను మించినావు, కవితాంబురుహాసనుడైన యట్టి తా
తయ్యను మించినావు, మహితాశు కవీంద్రుని నన్ను బుచ్చి రా
మయ్యను మించినావని జనాళి నుతింప ప్రసాదరాయ! ఆ
తియ్యని వింటి జోదు పిత తీర్చుత నీకు జయోదయమ్ములన్!

–శతావధాని శ్రీ కొప్పరపు బుచ్చిరామయ్య

*English Poetry:*

# THE GRAND FINALE

**- Prof P. Narasimha Reddy**

He is an old man of sixty or seventy
Living peacefully, hale and healthy
Suddenly some disease overwhelms him
Like a banyan tree that sprouts
In the walls of a dilapidated palace.

The person clings to the sick bed
Swallowing many a medicine
Punctured by many needles of syranges
Swinging in the saddle of the final journey
And ringing the bells of death.

The flow of kith and kin
And acquaintance begins
To the irritation of patient's care takers
Some soothing talks and many a good wish
Some expression of goodness and virtues of his deeds
Give a bit of solace to the patient

The fruits, sweets, biscuit and such eatables
Liked by the patient appear before him
Then the patient eats, chews and swallows
For the last time.
The inevitable drags on
The attendants feel tired, irritated
They pray the God
Not to bless the old one but to give relief to them

The inevitable occurs, suddenly and unexpectedly
The cot, clothes, medicines unused
And, a volley of memories
Remain behind the deceased.
The soul starts the eternel journey
In search of Almighty, the sacred.

*('అనుభూతుల పొదరిండ్లు' అనే కవితా సంపుటి నుండి)*

# Dr. Koduru Padma*

## 1. A Quest

I wandered and wandered
Like a wind with sway
Like a stream running astray
Like a kite broken in the sky
They asked me - "What are you wandering for?"
Said I - "I am searching for a bit of Humanity."

I searched and searched
In the scent of roses
In the blues of oceans
In the hues of rainbows
They questioned me - "What are you upto?"
Said I - "I am in search of a semblance of Love."

I waited and waited
In the desert sands of selfishness
In the hypocritic world of malice
Amongst the sarcastic laughters of my companians
They queried me - "What are you craving for?"
Said I - "I am praying for a drop of friendship."

Cried out my heart
For that glorious dawn of humanity I couldnot realise
For that devine touch of love I could not feel
For that nectar of friendship I could not taste
Consoled me a lone voice
"Why can't you teach them to the world, my dear?"
Said I - "Yes, that should be my endeavour."

---

* *Dr. Koduru Padma is now settled in U.S.A. as a doctor. She wrote these poems when she was just 17 years old and was studying her First Year M.B.B.S. at Kurnool.*

## 2. The Invisible

Heart knows not where you are
Yet love stops not wandering yonder
Ask not my thoughts to hover
For you are my passion to treasure
The hues of rainbows gather
With your thoughts when I retire
In my sweet dreams when you appear
Waves of apparent soothing encounter
When on me lovely roses shower
Say my dear
Is dreaming only in our store?
Are we another episode of yore?

## 3. Friendship

Friendship is a gift of heaven
Lest mortals forget all that humane
Friendship is the light of life sublime
Lest men of arrogance complain
Friendship is a fragrance divine
Lest men of evil vomit stink invain
Friendship is love and affection
Lest men of deceit talk of betrayal raven
It is a song of nightingale unceasing
It is the axiom of truth everlasting
It is the spring of life ever-enduring

## 4. Dusk and Dawn

As the inevitable dusk set in
I saw the light of the world drowning
Amidst ruby red streaks
Of the saphire blue skies

Like a flickering lamp in the wind
But the love of the world is dawning
Like an angel with a magic wand in hand
Life - what a wonderful one
The sun sets - yet the moon rises
The glory sets - but peace bounces
Life is always happy and wonderful
You have to but locate happiness
And learn to love its wonders.

*(to be continued in the next issue)*



# DEEPAVALI

**Dr. A. B. Sai Prasad**

Life is a flower -
The fragrance of which is virtue.

Life is a well -
The water of which is wisdom.

Life is the sun -
The Light of which is Divine Love.

Life is the moon -
The rays of which are Bliss.

Life is a Deepavali -
The lamp of which is friendship.
Wish you a Blissful & Virtuous Deepavali !!



కవి ప్రపంచం:

# 'విపులాచ పృథ్వీ'

*(క్రిందటి సంచిక తరువాయి)*

-సౌభాగ్య

## 4. పాల్ వేలరీ (క్రీ.శ. 1871-1945)

ఎక్కడ స్వప్రయోజనం స్పష్టంగా వుంటుందో
అక్కడ అన్నీ నీకు నిష్ఫల మవుతాయి
చీకటి కోణాల్లేని ప్రపంచంలో
ఎటువేపూ మొగ్గని బ్రతుకు చుట్టూ తిరుగుతూ
నీ కాంక్ష ఆత్మల్ని అనుసంధానించలేదు
అనూహ్యమైన ఆవేదన ఆకాశమిచ్చిన వరం
ఏదో ఒక లోపం భగవంతుడిచ్చిన వరం
నీ నేత్రకాంతి సన్నని సందుల చీకట్లలోకి
ప్రవహించాలని ఆశించు.
ఇబ్బంది లేని ప్రపంచ పర్వతం మీద
ఉత్సాహం లేని ఉదయం కావొద్దు
రహస్యాల నించీ రంగుల వసంతంలా పురివిప్పు
ఒకానొక నిర్ణీత క్షణం
స్వచ్ఛమైన, పవిత్రమైన గాఢానురాగాలు
అక్షరాల ఆకారం దాల్చి ఆహ్లాదంగా రెక్కలు కదిలిస్తాయి.
అజ్ఞాత అంధకారంలో జీవన ఖనిజాలున్నాయి
అనూహ్య నిశ్శబ్దం నించీ అద్భుతమైన కవిత కళ్ళు తెరుస్తుంది.

భావుకుడయిన, ఆలోచనాపరుడయిన, కవి కవిత గురించి చెప్పాలనుకున్నప్పుడు ఇలాంటి కవితే రాస్తాడు. పాల్ వేలరీ 1871లో జన్మించి 1945లో మరణించాడు. ఇరవయ్యో శతాబ్దంలోని ఫ్రెంచి కవులందరిలో ఆయన్ని అగ్రగణ్యుడిగా పరిగణిస్తారు, ఆయన తండ్రి ఫ్రెంచి పౌరుడు, తల్లి ఇటాలియన్ స్త్రీ. 21 సంవత్సరాల వయసులో

ఆయన పారిస్ వచ్చాడు. ఆయన స్నేహితుడయిన పెర్రీలూయిస్ ఆయన్ని మల్లార్మేకి పరిచయం చేశాడు. మల్లార్మే ద్వారా కవి బృందానికి పరిచయమయ్యాడు. సింబలిస్టు ధోరణిలో కొన్నాళ్ళు కవిత్వం రాశాడు. 1920లో కవితా సంపుటి తీసుకొచ్చాడు. కానీ వున్నట్టుండి కవిత్వం రాయడం మానేసి వచనం వైపు మళ్ళాడు. ఆయన తనని తాను ఎప్పుడు కవిగా చెప్పుకోవడానికి లేదా రచయితగా చెప్పుకోడానికి ఇష్టపడ లేదు. ఒక మామూలు ఆలోచనాపరుడుగా అభివర్ణించుకున్నాడు. కానీ 20వ శతాబ్దంలోని అతి మనోహరమైన, సౌందర్య భరితమైన ఫ్రెంచి కవితలు రాసిన వాడుగా ఆయన్ని ప్రపంచం గుర్తించింది.

ఆయన వ్యక్తిగతంగా పొందిన ప్రేమ వైఫల్యం ఆయన కవితల్లో కొంత దిగుల్ని మేళవించింది. 1922లో ఆయన సుప్రసిద్ధ కవితా సంపుటి 'ఎన్ఛాన్‌మెంట్స్' వచ్చింది. ఆయన జీవితమంతా శ్రమించి రాసిన 'నోట్‌బుక్స్' అన్న ఆయన వచన రచనలు ఆయన అనంతరం 29 సంపుటాలుగా ప్రచురించబడ్డాయి. ఆయన రచనల్లో ఆయన కవిగా శాస్త్రవేత్తగా కనిపిస్తాడు. ఆయన పరిశోధనాత్మక, పరిశీలనాత్మక వచన రచనల్లో ఆయన గాఢమైన తాత్విక దృష్టి కనిపిస్తుంది. ఇరవైయ్యేళ్ళ మౌనం తర్వాత ఆయన మళ్ళీ కవిత్వం రాశాడు. ఆ సందర్భంలో ఆయన చెప్పిన మాటలు ఎంతో ప్రసిద్ధమైనవి. 'మళ్ళీ గాలి మళ్ళింది - మనం జీవించడానికి ప్రయత్నించాలి!'. 'ఇరవయ్యో శతాబ్దంలో మొదటి యాభైసంవత్సరాలకు పాల్ వేలరీ ప్రతినిధి' అన్నాడు టి. ఎస్. ఇలియట్.

## 5. ఆంటోనియో మచాడో

(Antonio Machado: 1875-1939)

ఆంటోనియో మచాడో, స్పెయిన్‌లోని సెవెల్లీలో జన్మించాడు. ఆయన తండ్రి అంతర్జాతీయంగా సుప్రసిద్ధుడయిన జానపదగీతాల పరిశోధకుడు. మచాడో మాడ్రిడ్‌లో చదువుకున్నాడు. చిన్నప్పుడే వ్యంగ్య గల్పికలు రాశాడు. ప్రపంచ రంగస్థల కార్యకలాపాల్తో ప్రభావితుడయ్యాడు. ఆయన తమ్ముడూ కవే. తమ్ముడితోపాటు 1899లో పారిస్ వెళ్ళాడు. ఒక ప్రచురణ సంస్థకోసం ఇద్దరూ ఎన్నో అనువాదాలు చేశారు. పారిస్‌లో సింబలిస్టుల్తో సంబంధాలు పెంచుకున్నారు. గౌటిమాలా దేశానికి చెందిన ఒక ప్రభుత్వ సంస్థలో మచాడో ఉద్యోగం చేశాడు.

మచాడో తన తొలి కవితా సంపుటి 'సాలిట్యూడ్స్'ని 1903లో తెచ్చాడు. పేరు తెచ్చుకున్నాడు. స్కూళ్ళలో ఫ్రెంచి భాష బోధించడానికి తగిన పరీక్షలో ఉత్తీర్ణుడై మాడ్రిడ్ దగ్గర 'సోరియా' అన్నచోట, ఉద్యోగంలో చేరాడు. అక్కడ పద్నాలుగేళ్ళ వయసున్న భవిష్యత్తులో తనకు భార్య కాబోతున్న 'లియొనార్' ని కలిశాడు. రెండేళ్ల తరువాత ఆమెని పెళ్ళాడాడు. 1911లో పారిస్‌లో బెర్గ్‌సన్ ఉపన్యాసాన్ని విన్నాడు. తన భార్య తీవ్ర క్షయవ్యాధితో బాధపడుతున్న సంగతి తెలుసుకున్నాడు. 1912లో ఆమె మరణంతో ఎంతో విషాదానికి లోనయ్యాడు.

తత్వశాస్త్రాన్ని తీవ్రంగా అధ్యయనం చేసి మచాడో 1918లో మాడ్రిడ్ యూనివర్శిటీ నుండి డాక్టరేట్ పొందాడు. 1919 మొదలు రంగస్థలాన్ని దృష్టిలో పెట్టుకుని రచనలు చేశాడు. 1926లో ఒక వివాహిత స్త్రీతో సన్నిహిత సాహచర్య మేర్పడింది. చాలా కాలం ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించాడు. 1927లో స్పానిష్‌సాహిత్య అకాడెమికీ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1936లో ఒక తాత్విక గ్రంథం ప్రచురించాడు.

ఆయన సోదరుడు స్పానిష్ అంతర్యుద్ధంలో జాతీయవాదుల్తో కలిశాడు. ప్రజాస్వామ్యవాదుల పట్ల సానుభూతి పరుడయిన మచాడో తల్లితోబాటు స్పెయిన్ సరిహద్దుదాటి ఒక ఫ్రెంచి గ్రామంలో తలదాచుకున్నాడు. అక్కడ నుండి కనిపించే స్పెయిన్‌ని ప్రేమగా చూస్తూవుండేవాడు. న్యుమోనియా జ్వరంతో అక్కడే చనిపోయాడు. ఆయన చనిపోయిన మూడురోజులకు ఆయన తల్లి చనిపోయింది.

జిమెంజ్ నోబెల్‌బహుమతి గ్రహీత ఐనా, స్పానిష్‌కవుల్లో మచాడో తరువాతే ఆయన్ని చెబుతారు. మచాడో ఒక మిత్రునికి రాసిన వుత్తరంలో ''ఆలోచించడం కన్నా తెలివి తక్కువ విషయం మరొకటి లేదు. కొంతమంది ఫ్రెంచి కవులు 'అనాలోచితం'గా జీవించారు కూడా. సౌందర్యానికి మూల ధాతువు రహస్యమే అన్న సంగతి వాళ్ళకు తెలుసు'' అన్నాడు. 'కళ కళ కోసమే' అన్న సిద్ధాంతంతో ఆయన ప్రభావితుడు కాలేదు. పైగా 'కళ సత్యం కోసమే' అన్నాడు. 'సత్యాన్ని ఆవిష్కరించే నాలుగు పదాలు నైరూప్యాన్ని పులుముకున్న నలభైపదాలకన్నా విలువైనవి' అన్నాడు. తన కవితల్లో ఆయన దృశ్యాన్ని కళ్ళకు కట్టించగలడు.

''చల్లగా, మగతగా వున్న మధ్యాహ్నం, చల్లని చలికాలం
క్లాసులో పిల్లలు చదువుకుంటున్నారు
ఎడతెగని వర్షం ఏకధారగా కురుస్తోంది''

ఆయన అద్భుతాల ఆవిష్కారానికి ఆరాట పడడు. స్వప్నాల వెంట పరుగు తియ్యడు. జీవితానికి సంబంధం లేని కల్పనల జోలికి వెళ్ళడు. ఆయన కల్పనలు కూడా జీవ పరిమళంతో గుభాళిస్తాయి.

''ప్రావీణ్యం లేని చేతివ్రేళ్ళు
మధుర మంద్రగానాన్ని సరళీకరించడానికి వ్యర్థప్రయత్నం చేస్తాయి.
ప్రయత్నించి, ప్రయత్నించీ విసిగిపోతాయి.
పియానో నుండి వచ్చే పిచ్చి శబ్దాల్ని, చెవుల్ని విసిగించే వికార ధ్వనుల్ని
పసివాడుగా వున్నప్పుడు విన్నాను.
నాకు చేతగాని దాన్ని, నాకు అజ్ఞాతమైన దాన్ని
సృష్టించాలన్న స్వప్నం నన్ను తాకుతూ వెళ్ళింది.
కానీ అది నాలో ప్రవేశించలేదు, నన్ను దాటిపోయింది'' అంటాడు.

ఆయన రెండో కవితా సంపుటి 'ఫీల్డ్ ఆఫ్ కాస్టైల్ 1912లో వచ్చింది. ఆ రెండో సంపుటిలో ఆయన ఆలోచన, విచికిత్స విస్తరించినట్లు కనిపిస్తుంది.

'నేను సంప్రదాయవాదినా? కాల్పనికుణ్ణా?
యుద్ధ వీరుడు కత్తిని ఝుళిపించినట్లు
నా కవితను మెరిపించడం మాత్రమే నాకు తెలుసు' అన్నాడు

ఆయన కవితల్లో తన శక్తిని తనే పరీక్షించుకోవడం, చిన్నివయసులోనే చనిపోయిన భార్య పట్ల ప్రేమ, కనిపిస్తాయి. 'ఆకాశంలో ఏదో అద్భుతం జరిగి ఆమె తిరిగి వస్తుందని ఆయన హృదయం ఆరాటంతో ఆశగా ఎదురు చూస్తుందని' ఓ కవితలో రాస్తాడు. కొన్ని స్వప్నాలు స్వప్నాలుగా మిగిలిపోతాయి. పదిహేనో శతాబ్ది స్పానిష్ కవి రాసిన కవితలోని కొన్ని మాటలు మచాడోకు ఎంతో ఇష్టమైనవి. ''మన జీవితాలు నదుల్లాంటివి, అవి మృత్యు సముద్రంలో కలవడానికి పరుగులు పెడతాయి'' ఆ కవిత ప్రేరణతో ఆయన తన భార్య స్మృతిపై గీతం రాశాడు.

''దేవుడా! నాకు ప్రపంచంలోకెల్లా అపురూపమైనదాన్ని నా నుండీ లాగేశావు
దేవుడా! నా మనసు కుమిలి కుమిలీ రోదిస్తోంది.
ఇదంతా నీ ఇష్ట ప్రకారమే జరిగింది
ఫలితంగా ఇప్పుడు ఇద్దరం ఒకటయ్యాం
ఆ ఇద్దర్లో ఒకరు నా హృదయం, రెండోది ఘోషించే సముద్రం''

అంటూ విలపిస్తాడు. పిలాసియో అన్న తన ప్రాణస్నేహితుణ్ణి తన భార్య సమాధిని దర్శించమని చెబుతూ -

'నైటింగేల్ గానం వినిపించే చోట, లిల్లీలు విచ్చుకుంటున్న ఘడియలో
తొలి తాజా గులాబీలు వికసిస్తున్న నీలి మధ్యాహ్న సమయంలో
పర్వతసానువులు ఆకాశాన్ని అంటుతున్న చోట ఆమె నివాసముందని'

చూపిస్తాడు. వ్యక్తిగత జీవితంలో తగిలిన గాయాలనించి ఆయన నిరాశావాది కాలేదు. తన ప్రేమను మానవత్వ ప్రేమగా పరివర్తింపజేసే ప్రయత్నం చేశాడు. **'మనమంతా సృష్టికర్త నేస్తున్న మగ్గంలో దారాల్లాంటివాళ్ళం! మన కలల్ని మనం కలగనడానికి, జీవించడానికి పుట్టాం'** అంటాడు.

'న్యూసాంగ్స్' అన్నది ఆయన మరో కవితా సంపుటి.

'ఈరోజు' అన్నది ఎప్పటికీ కొనసాగుతుందని, మార్మికమైన దాన్ని దర్శించే ప్రయత్నం అంతం కాదని' అంటాడు. ఆయన ఆర్ద్రతని, కళాశీలాన్ని జీవితాంతం నిలుపుకున్నాడు. చివరి కవితల్లో కూడా గాఢసౌందర్య ఆవిష్కారం కనిపిస్తుంది.

''నిశ్శబ్ద ఏకాంత ఘడియలు గడిచిపోయాయి
ఫౌంటైన్‌లు నిష్క్రమించాయి
పాలరాతి గర్భంలో పండు వెన్నెల దాక్కున్నట్లుంది.
నీటి కదలికల శబ్దాల్లో నిర్మలగానం నిద్రపోతున్నట్లుంది!''

ప్రసిద్ధ చిత్రకారుల, ఫ్రెంచి కవుల స్వచ్ఛమైన చిత్రణల్ని, భావనల్ని, గాఢంగా అధ్యయనం చేసినవాడు కావడంవల్ల మచాడో ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాల్లో ప్రసిద్ధి పొందాడు. పైగా ఆయన ప్రపంచ ప్రసిద్ధి వెనక 'అందరూ మాట్లాడే భాష' ఆయన కవితల్లో వుందని కొందరు అంటారు. ఆయన ప్రచారమున్న కవి ఐనా ప్రచారం లేని తాత్వికుడు.

# 6. జువాన్ రామోన్ జిమేంజ్

## (Juan Ramon Jimenz: 1881-1958)

జిమేంజ్ స్పెయిన్‌లోని 'మోగుయెర్' లో 1881లో జన్మించాడు. సంపన్నుడయిన తండ్రి. సంస్కార కుటుంబం నుండి వచ్చిన తల్లి. స్కూల్లో పదకొండో ఏట చేరాడు. శ్రద్ధగా చదువుకున్నాడు. కానీ ఏదో తెలియని అసంతృప్తితో అల్లాడేవాడు. ఇతర ప్రాంతాల్లో ఉన్నత విద్యాభ్యాసం కోసం వెళ్ళి 1897లో అనారోగ్యంతో ఇంటికి తిరిగివచ్చాడు. 1900వ సంవత్సరంలో సుప్రసిద్ధ కవి రూబెన్ డేరియోని మాడ్రిడ్‌లో కలుసుకున్నాడు. 1901లో తండ్రి మరణంతో నరాల బలహీనతకు లోనయి మానసిక రుగ్మతతో ఆస్పత్రిలో చేరాల్సి వచ్చింది. 1901 నుండి 1905 దాకా మాడ్రిడ్‌లో నివసించాడు. సొంతవూళ్ళో 1905నుండి 1912 దాకా వున్నాడు. సుకుమార శరీరతత్వం గలవాడు. ఏకాంతాన్ని, ప్రశాంతతని ఆశించేవాడు. మాడ్రిడ్‌లో ఒక యువతి పరిచయమయింది. పరిచయం పరిణయానికి దారితీసింది. ఇద్దరూ కలిసి 1916లో న్యూయార్క్ సందర్శించారు. తిరిగి వచ్చాక ఇరవయ్యేళ్ళు మాడ్రిడ్‌లో నివసించారు.

ఆయన పట్టించుకోనట్లు ప్రవర్తించినా యువకవులందరూ ఆయన్ని ఆధునిక స్పానిష్ కవిత్వానికి నాయకుడుగా కీర్తించారు. ఆరాధించారు. స్పెయిన్ సాంస్కృతిక అధికార హోదాలో అమెరికా, పోర్టొరికో, బర్మా, క్యూబాల్లో 1936నుండి 42 దాకా వున్నాడు. అర్జెంటీనా, ఉరుగ్వేల్లో పర్యటించి సాహిత్యంపై ఉపన్యాసాలిచ్చాడు. 1956లో నోబుల్ అవార్డు పొందాడు. ఆ అవార్డు అందుకుంటున్న సందర్భంలో భార్య మరణించిన వార్తవిని కుంగిపోయాడు. తరువాత రెండేళ్ళకే తనువు చాలించాడు.

నోబెల్ అవార్డుతో ప్రపంచ ప్రసిద్ధుడయినా, సమకాలికుడయిన ఆంటోనీ మచాడో స్థాయికి చెందిన ప్రతిభావంతుడయిన కవిగా స్పెయిన్‌లో పేరుపొందాడు. 1920 నాటికే స్పానిష్ భాషలో గొప్ప కవిగా గుర్తింపుపొందాడు. సమకాలీన జీవన గమనాన్ని ప్రతిభావంతంగా ప్రతిఫలించడంలో ఆయన కవిత సాటిలేనిది. మొదటిరోజుల్లో సింబాలిజంతో, ఇంప్రెషనిజంతో ప్రభావితుడయినా ప్రాచ్య దేశాలకు సంబంధించిన సాహిత్య ప్రభావం కూడా ఆయనపై అపారంగా వుంది. ఆయన, భార్య సహకారంతో రవీంద్రనాథ టాగూర్‌ని స్పానిష్ భాషలోకి అనువదించాడు. జిమేంజ్

పదిహేడేళ్ళ నుండి ముప్ఫయి ఆరేళ్ళ వయసు మధ్య పదిహేడు కవితా సంపుటాలు ప్రచురించాడు. వాటన్నిట్లో 'స్వీయ ఏకాంతదృష్టి' వుంది.

**'మధ్యాహ్నం రోడ్లన్నీ కలిసి రాత్రయ్యేసరికి ఒక్క రోడ్డుగా మారిపోయాయి.**
**ఆ మార్గం గుండా నీ దగ్గరకు వస్తాను.**
**రహస్యంగా రక్షింప బడుతోన్న ప్రేమ దగ్గరకు వస్తాను.**
**పర్వతాన్ని స్పర్శించే కాంతి కిరణంలా నిన్ను సమీపిస్తాను.**
**సముద్రం పై సాగే చల్లగాలిలా సాగివస్తాను.**
**పూల పరిమళంలా పులకిస్తూ వస్తాను'** అంటూ

ఏకాంత హృదయం లోని ఊహల్ని వర్ణిస్తాడు.

ఆయన గీతాల్లోని గానయుక్తమైన పాదాలు అనువాదంలో లయకు దూరమవుతాయి. స్వచ్ఛమైన ప్రేమపట్ల స్వచ్ఛ స్ఫటిక అనురాగం పట్ల ఆయన ఆరాధన కనిపిస్తుంది. తరువాతి రోజుల్లో ఆయన రాసిన వచన కవితలు వీటికి భిన్నమైనవి. ఆయన వచన కవితలు రాసినా 'సానెట్ల' పట్ల ఆయనకెంతో మమకారం. ఆయన మార్మిక మాధుర్యాన్ని సాంకేతిక నైపుణ్యంతో నిక్షిప్తం చెయ్యడానికి సానెట్లు అనుకూలమయినవని నమ్మాడు.

**'నీ గులాబీ ఇతర గులాబీలకు నమూనా**
**నీ శ్రవణేంద్రియం మధురనాద సంకేతం**
**నీ ఆలోచనలు కాంతి కిరణాలు**
**నీ నిర్నిద్ర నిరీక్షణ నక్షత్రాల అనంత వికాసం'**

అంటూ ఆశ్చర్యపు అంచులు ప్రదర్శిస్తాడు. ఫ్రెంచికవి పాల్‌వర్లేన్ ఆయన అభిమాన కవి. 1914లో కవితాత్మకమైన ఒక రచనలో 'చిన్నితనంలో ఒక గాడిదతో తనకున్న స్నేహాన్ని గురించి అద్భుతంగా వర్ణించాడు. స్పానిష్ సాహిత్యంలో అది అపూర్వ రచనగా పేరు పొందింది. అట్లాగే 'ఇటీవలే పెళ్ళయిన కవి డైరీ' అన్న కవితా సంపుటి ఆయన రచనలో సుప్రసిద్ధమైంది. ఆ సంపుటి నుండి ఒక కవిత చూద్దాం. సాధారణంగా కవుల భార్యలు సుఖపడరని అంటూ వుంటారు. అట్లాంటి తత్వాన్ని ఈ కవిత ప్రదర్శిస్తుంది.

**'నిన్ను ఒక గులాబీలా భావించాను**
**భావించి ఆ గులాబీ కేసరాల్ని లాగేశాను.**

ఎందుకు ఆ పని చేశానంటే నీ ఆత్మని దర్శించడానికి
కానీ నేను నీ ఆత్మని చూడలేకపోయాను.
ఐతే భూగోళాల, సముద్రాల, దిగంతాల, సరిహద్దుల్లో
సమస్తమూ సంపూర్ణంగా కనిపిస్తోంది, అనిపిస్తోంది.
వాటి అంతరాంతరాల్లో, సమగ్రతా, సజీవత్వమూ
దైవ స్వరూపంలా, దైవ స్వభావంలా నన్ను ఆకర్షిస్తున్నాయి' అంటాడు.

అజ్ఞాతం పట్ల, నైరూప్యం పట్ల ఆయనకు ఆకర్షణ వుంది. అన్ని వస్తువుల్నీ, అందరు మనుషుల్నీ, అదుపు చేసే ఆకర్షించే అతీత కేంద్రమేదో వుందని నమ్ముతాడు. స్థలాన్ని ఆక్రమించిన కాలం, కాలచక్రంలో ఇమిడిన స్థలమే ఆ కేంద్రకం- అంటూ 'కవిత్వాన్ని ఆవరించిన వలయం జీవితమే. అంటే మనిషే ప్రపంచం' అని తను మరణించడానికి కొన్ని రోజుల క్రితం రాశాడు. 'మనిషి జీవితం భౌతిక అస్తిత్వం వున్నంత వరకే కాదు. అది అనంత స్థలకాల పరిమితులకు, పరిధులకు లొంగనంత మేర వ్యాపించి వుంటుంది' అంటాడు. నీషే తత్వానికి ఇది ఆయన స్వీయవ్యాఖ్యానం లాంటిది.

''ఆత్మకల్పించిన ఆనంద సీమలో
నా స్వకీయ స్వప్న కేంద్రకంలో జీవిస్తాను.
స్వేచ్ఛని శ్వాసిస్తాను!'' అంటాడు.

ఇంకో కవితా శీర్షిక చిత్రంగా వుంటుంది: I am not I ('నేను నేను కాను'). ఆధునిక కవులందర్లాగే ఆయన్నీ 'మృత్యువు' ఆకర్షించినట్లు కనిపిస్తుంది. స్పానిష్ అంతర్యుద్ధంలో ఆయన బావమరిది చనిపోయాడు. ఆ దుఃఖం కొన్ని కవితల్లో కనిపిస్తుంది. అతనిపై ఒక స్మృతి గీతం రాశాడు.

భవిష్యత్తు పట్ల తపన ఆయన కవితల్లో వుంది. మనిషి కొన్ని సందర్భాల్లో దురదృష్ట జీవిగా, బలహీనుడుగా ఆయనకు కనిపిస్తాడు. కవిత్వ మొక్కటే మనిషిని పునరుజ్జీవితుణ్ణి చేసే శక్తిగా ఆయన భావిస్తాడు. ఆయన కవిత్వమంతా కాలాతీతమైన దానికోసం, శాశ్వతమైన దానికోసం అన్వేషణ. అది అడుగడుగునా మనల్ని ఆశ్చర్యంలో ముంచుతుంది.

(సశేషం)

అనుబంధం:

## ఆచార్య లింగంనేని బసవశంకరరావుగారికి

# అభినందన మందార మాల

*(5-1-1999 ఉపాధ్యాయ దినంనాడు మద్రాసులో శంకరరావుగారి శిష్యులు మిత్రులు కలిసి చేసిన సన్మాన సభలో చదివిన కవితలు)*



1964లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో
పరిశోధక విద్యార్థిగా ఉన్న శ్రీ ఎల్. బి. శంకరరావు

# బసవ శంకరం

-శ్రీ దుగ్గిరాల రామారావు

పుట్టినరోజుఁ గూర్చి తగవున్ దెగఁబెంచిన వారి యాటలన్
గట్టి, పదమ్మునుండి సరగన్ దొలఁగించిన వారి నెత్తిపై
మొట్టి, యమోఘమైన జయమున్ గొని వచ్చిన నిన్నుఁ జూచి నీ
జట్టు ముదంపడెన్ బసవశంకర! లింగమనేని వంశజా! 1

ప్రాచ్యభాషానురక్తి యప్రాచ్యవేష
ధారణాసక్తి రూపమ్ముఁ దాల్చిపుట్టి
విబుధపుంగవ! విఖ్యాతి వెలయు నీకు
బసవశంకర నామ మన్వర్థమయ్యె. 2

'సూటున్-నెక్టయి-బూటు'ఁ జూడ ననిపించున్ 'నీవు పాశ్చాత్యపున్
బాటన్ బోయెడి వాఁడవేమొ'? యని, నీ పాండిత్య వైయాత్య రే
ఖాటోపాంచిత బోధనాసమయ నిర్యద్వాగ్గరీ వీచికా
ర్భాటమ్ముల్ ప్రకటించు భారత మహోపాధ్యాయ వైదుష్యమున్. 3

కన్నడ సీమలోఁ దెలుఁగు గడ్డపయిన్ గడు సుప్రసిద్ధమౌ
చెన్నపురిన్ ద్వదీయులగు శిష్యులు దేశికతా పదమ్మునం
దున్నత పీఠమెక్కి భవదున్నతిఁ జాటిరి చాటుచుండి రీ
వన్నెయు వాసి నీదు సహపాఠుల కెక్కుడిదోయి! శంకరా! 4

గురునకుఁ బంగనామమిడు కొక్కులు మిక్కుటమైన రోజులన్
గురువరు షష్టిపూర్తికి నకుంఠిత భక్తి మహోత్సవమ్ములన్
జరిపెడు శిష్య సంతతి యెసంగుట కెన్ని మహావ్రతమ్ములన్
జరిపితివో కదా! బసవశంకర! నీవు పురాభవమ్మునన్. 5



# శుభాశంసనలు

– డా॥ వి. రామచంద్ర చౌదరి

శ్రీయుతులైన నీదు ప్రియశిష్యులు ప్రేమము మీఱ నీకిటున్
జేయఁగ వేచియుండిరటె చేకొని సద్గురుపూజ ఏ యుపా
ధ్యాయున కిట్టి గౌరవము దక్కునొ ఆతఁడె ధన్యుఁడెన్నఁగా
నీ యిల, శిష్యకోటి మదికెక్కి తరించితివయ్య శంకరా! 1

సాటి యెవండు పో బసవశంకర లింగమనేని నీకు నే
పూటయు 'దుస్తు' నల్లని తపోనియతిన్ ధరియించుటందు, నే
మాటయు రక్తిగాఁ బలుకు మన్ననయందును, మిత్ర కోటితో
గాటపుఁ బ్రేమతో మెలఁగఁ గాంచుట యందును నెంచి చూడఁగాన్. 2

మానితంబగు లింగమనేని పేరు
బసవశబ్దమ్ము శంకర పదముగూడఁ
గలిసి నిలిచెను నామమ్ముగాఁగ నీకు
నీవు ముమ్మాటికైశ్వర్య నిధివి సుమ్ము! 3

వేంకటేశ్వర విశ్వవిద్యాలయమ్ములోఁ
బరిశోధకుల మోచు వఱలునాఁడు
సతతమ్ము సుకవిత్వ సంసక్త చిత్తత
రసరమ్యలోకాల వ్రాలునాఁడు
విద్యాలయమ్ములో వేడ్కగా సాహితీ
చర్చల వర్తిల్లఁ జాలునాఁడు
చిట్టి తుప్పలలోనఁ జేకొని పుల్లని
'కలివి' కాయలు తినఁగలుగునాఁడు

యౌవనమ్మున దిగులు రవ్వంతలేక
చదువు సంధ్యలు సాగింపఁ జాలునాఁడు
కలుగు నానంద మిప్పుడెక్కడకుఁ బోయె?
బడలి యింతలో విశ్రాంతి వడయుటేమి? 4

సంతత భారతాధ్యయన సంగత చిత్తుఁడవై విశేషముల్
వింతగఁ జెప్పనేర్చిన వివేకివి, నీవలె సాహితీ సము
ద్రాంతర నిత్య సంచరణ రక్తి విరాజిలు వారలెందఱో
వింత జగాన నేఁడు కనిపింపరు ధన్యతముల్ భవాదృశుల్. 5

ఒడలు డాఁపని కర్మవీరుఁడవు నీవు
దురుసులాడని ఆర్ద్ర చిత్తుఁడవు నీవు
ఒరుల నీవలెఁ జూచు యోగ్యుఁడవు నీవు
పరుల మేల్గోరు సద్గుణాస్పదుఁడ వీవు! 6

పరుల దోసమ్ము లెన్నని భవ్యమతివి
నిరతమును శిష్యులన్గాచు నిపుణమతివి
కరఁగి కైతలో లీనమౌ సరస మతివి
గమ్యమును జేరఁగల్గిన గణ్యమతివి! 7

వృద్ధుఁడ వంచు నిన్నుగని యేబది యెన్మిది యేండ్లనెంచు సం
బద్ధము యేమొ ఇట్లు పనిమానిపి పంపిరి గాక, నీకిఁకన్
బుద్ధులు చెప్పువారెవరు పొమ్మ, స్వతంత్రుఁడవీవు నీకు లే
విద్దర నెట్టి శాసనము, లేలుము 'భారతధర్మ' రాజ్యమున్. 8

చదువుల్ సెప్పుట ముప్పదేండ్ల మునుపే సాగించినావీవు నీ
పదవిన్వీడి విరామమున్ బడసి యిబ్బంగిన్ లసచ్ఛాత్రు లిం
పొదవన్ జేసెడి సత్కృతుల్ వడయ నీ కొప్పారె ధన్యత్వమే
కొదువల్ లేవిఁక హాయిగా మనుము నీకున్ గల్గు దీర్ఘాయువుల్! 9

''నెత్తుటి మరకలతో ఎరుపెక్కిపోతోంది ధాత్రి
కరుణజలం తెచ్చి కడిగి పోవమ్మా సంక్రాంతీ!''

– రాజు

# ఆశంస

-ఆచార్య కె. సర్వోత్తమరావు

ప్రాచీన సాహిత్య పఠనంబు పరికింప
విందు భోజనముగా వెలసె నీకు
కమనీయ రమణీయ కావ్య ప్రయోగాలు
వేద నాదాలుగా విరిసె నీకు
బుధులు మెచ్చెడి రీతి బోధనల్సేయుట
పవనాంకురంబుగా పరగె నీకు
పరిశోధకుల్ మెచ్చు పర్యవేక్షణ మెల్ల
కరతలామలకమై మెరసె నీకు

పండితుల్మెచ్చు నరుదైన పాటవంబు
సహజ సిద్ధమై కనుపట్టు సౌమ్యమూర్తి
ఎల్.బి. శంకరరావని ఎల్లవారు
ప్రీతి గొనియాడ సతతంబు పెంపుగనుమ!



# శంకర స్తవమ్!

-శ్రీ శివశ్రీశర్మ

ఉ॥ చెప్పెను చంద్రశేఖరుఁడు, చెప్పెను తానయి రామకృష్ణుఁడున్
గొప్పగ మీ గుఱించి, మది గూర్చిన మాటల నిష్ఠబుద్ధితో,
గొప్పలు విన్న నా మనసు కూరిమిఁగోరెను మీదు గౌరవం
బొప్పగ, చూడ మీ పథము - ఉజ్జ్వలమై- అలరారునెప్పుడున్. 1

శా॥ సాహిత్యస్పుర దిందుమండల లసత్సౌదామినీ మూర్తులై
సాహిత్యంబను రాజ్యమున్ గెలువగా సత్కార్థ వాగ్వీరులై

స్నేహత్వంబున సర్వులన్ కలువగా ప్రేమ స్వభావంబుతో
మాహాత్మ్యంబును పొందరే! మహి! మహామాన్యేశ్వరుల్ 'శంకరుల్'. 2

ఉ॥ శంకరరావు లా పరమ సాత్త్విక పూర్ణ మనోజ్ఞ మూర్తులే
ఆ కరుణాంతరంగమె! మహాకృతి పొందిన మాన్యదీప్తులై
శ్రీకర చిద్విలాసములు చిందుచు చిచ్చతురోక్తులై సదా
పాకము పొందినట్టి ఘన పండితమూర్తికి నేను మ్రొక్కెదన్. 3

చ॥ గురువుకు సత్యరూపమయి - కోరిన విద్యల నెల్లపొంది - సం
బరమున నిత్యనూత్నమయి భద్రముగా వెలుగొందు వారొకో!
సురుచిర 'సుందరం'బునయి - శోభలతో నభి 'రామచంద్రు'లై
బరువు లనేక 'రంగ'మున బాధ్యతలన్ నెరవేర్చినారహో! 4

ఉ॥ భారత భారతీ హృదయ భావము చక్కగ గాంచినారు - ఆ
సారము నెల్ల చక్కగను సాధన చేయుచు పల్కువారు - ఏ
భారము గాదు శిష్యులను పండితులౌనటు తీర్చిదిద్దగా
మారని వారినైనను 'శమంతకమౌ'చును వెల్గుచుండగన్. 5



# భవ్యమూర్తి

-శ్రీ జక్కంపూడి మునిరత్నం

సీ. సాహిత్య మొక చేత సద్భాష నొక చేత
ధరియించి సాగెడు ధన్యమూర్తి
ఎవరెదురైనను నింపుగా భాషించి
ఆహ్లాద మొనగూర్చు నమలమూర్తి
బోధనలో పరిశోధనలో క్రొత్త
సాధన చూపు ధీ చతురమూర్తి
శిష్యవత్సలతతో చిఱునవ్వు చిందించు
ప్రియతముండై తోచు ప్రేమమూర్తి

తే. గీ॥ కవ్రతకు నెలవైన సంస్కారమూర్తి
బసవశంకరరావాఖ్య భవ్యమూర్తి
ఆయురారోగ్య భాగ్యములందు కొఱకు
విష్ణుమూర్తిని కృపఁజూప వేడుకొందు.



మినీ కవిత:

## 'పుండరీకాక్షుడు'

-తంగిరాల

ఎక్కడో 'దొండపాడు' చెఱువులో
చక్కగా వికసించిన ఒక
పల్లెటూరి తెల్లకలువ -
ఇక్కడ
చెన్నై నగర మహాసాగర తీరంలో
పార్థసారథి పాదాలమీద వ్రాలి
గుప్పున గుబాళించింది.
ఏమైనా
ఈ స్వామి
'పుండరీకాక్షుడు' కదా!

పసుపు రంగు దుస్తుల్తో
సైకిళ్ళు తొక్కుతూ ముగ్గురమ్మాయిలు
బజారంతా చేమంతి తోట!

-ఇస్మాయిల్

దీర్ఘ కవిత:

# 'దొండపాడు' చెఱువులో ఒక పుండరీకం!

-తంగిరాల

## 1

కృష్ణవేణీ తరంగిణీ మధుర జలాల ఆలింగనంతో
పంట పొలాల పులకరింతల 'గుడివాడ' వసుంధర బుగ్గమీది
అందమైన పుట్టుమచ్చలా
అలరారే 'దొండపాడు' దొడ్డగ్రామం నడుమ
కమ్మ మోతుబరి రైతుల శ్రమైకజీవన సరోవరంలో
లింగమనాయని శౌర్యవంశ పరంపర తామర తంపరలో
వికసించిన ఒక పుండరీకం మా బసవశంకరం!

మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి
మట్టి పిసుక్కుంటూ, స్కూలుకు వెళుతూ వస్తూ
పొలంగట్ల బెండచెట్లకు నీళ్ళుపోస్తూ
గట్టి సాహిత్య సంస్కారాన్ని పెంచుకున్న దిట్ట
పృథ్వీగంధ సహజ పరిమళం నుండి
చదువుల తల్లి ఇష్టైన కల్హార సురభిళం రావడం
ఒక ఆశ్చర్యకర పరిణామం!

గుడివాడలో
వ్యాయామశాలలో
దండీలు తీయడం బస్కీలుకొట్టడం బరువులు ఎత్తడం
బలంతో యౌవన మదంతో ఎన్నో తప్పటడుగులు
సిగరెట్లు కాల్చడం సినిమాలు చూడడం
చెలికాళ్ళతో సిగపట్ల గోత్రాలు
బ్రతుకు వెలుగునీడల దాగుడుమూతల విచిత్ర తంత్రాలు

పై చదువులు చదవాలనే తపన
కాశీ విశ్వనాథుని సన్నిధిలో గంగలో మునిగి
ఏడుకొండల సామి పాదాల చెంత తేలడం
అక్కడే నీకూ నాకూ మైత్రీ బంధానికి నాంది
కృష్ణా గోదావరుల స్నేహ సంగమ ప్రస్తావన
ఒకటా రెండా నలభైయేళ్ళ జీవన సుమగంధం!
ప్రావృట్కాల ఇంద్రధనువుల సప్తవర్ణ రమ్యరూపకం!

## 2

'స్వర్థయా వర్ధతే విద్యా'
పంతాలతో ఎం.ఏ. చదువు
పట్టుదలతో పరిశోధన
'స్రవంతి' లో 'సాహితి' లో వ్యాసరచన
'పట్టాభి' పారిజాతాల చెలిమి
'ముంగిలి పట్టు నాయుడు' గారి మొగలి పొదల గాఢమైత్రి!

కమ్మ-రెడ్డి ఎద్దుల కుమ్ములాటలో
ఈ లేగదూడలలో
ఒకటి ద్రావిడ దేశానికీ
మరొకటి కర్ణాటకానికీ వలసలు.
తన్నితే బూరెల గంపలో పడ్డాం!
ఎక్కడికక్కడే సామ్రాజ్యాలు స్థాపించుకొని
ఒక్కొక్క మెట్టే ఓపికతో ఎక్కి
ఇంతింతై వటుడింతయై
త్రివిక్రములమై
తెలుగునేల వెలివేసిన తీరని బెంగను
లోలోపల తీరాలను తినివేస్తున్న గంగను
మాతృభాషా నేపథ్యం నుండి మనల్ని
సప్త సముద్రాల ఆవల ఊడలమఱ్ఱి దీవిలోకి

విసిరేసిన వక్రించిన విధి బలిచక్రవర్తిని పట్టి
సూర్యగోళ సదృశ ధగద్ధగాయమాన చైతన్యంతో
ఆకాశసదృశ ఆత్మవిశ్వాస తృతీయ పాదంతో
పాతాళానికి త్రొక్కేశాం...
ద్రావిడ కర్ణాటకాల్ని
ధైర్యంగా పాలిస్తున్నాం....

## 3

నా ప్రాణాధిక మిత్రమా!
మట్టిలో పుట్టిన మాణిక్యమా!
శ్రీరామునికి గుహుడుగా సుగ్రీవుడుగా విభీషణుడుగా
నాకు నీవు అనుజన్ముడవు!
ఖంగున మ్రోగే కంచుకంఠంతో ఇన్నేళ్లుగా
పాఠ ప్రవచనాల గంటల కొట్టావు;
అనేక శిష్యరత్నాల్ని చక్కగా సానపట్టావు;
నీ అంతటి వారిగా తీర్చిదిద్ది జ్ఞానభిక్ష పెట్టావు;
కవిత్రయ భారతాన్ని పుక్కిట పట్టావు;
ప్రాచీన కవుల భాషా పరిశోధనల పారం ముట్టావు;
స్నేహం కోసం నీ సర్వస్వం పణంగా పెట్టావు;
నిండు మనసులో నీ ప్రాణదీపాన్ని వెలిగించి
మన గాఢమైత్రికి హారతి పట్టావు!
దొండపాడు చెఱువులో
వేయి రేకులుగా వికసించిన
నా పుండరీకమా!
శ్రీ వేంకటేశ్వరుని అభయ హస్తముద్ర క్రింద
నవరత్న కాంతి ప్రవాహంలో స్నానమాడావు!
పునీతమై
చెన్నై పార్థసారథి పాదాల చెంత చేరావు!
పరమ రాజసంతో బ్రతుకంతా పరిమళించావు!!

నీవూ - నేనూ
ఒక రకంగా - కృష్ణార్జునులం!
ఇంకొక రకంగా - సుయోధన రాధేయులం!
స్వర్గమో నరకమో
ఎక్కడైనా
మనమిద్దరం
ఎప్పుడూ
ప్రాణమిత్రులమే!!



# స్నిగ్ధ జీవనది

-ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ

మాస్టారూ! మీరు పదవీవిరమణ చేశారంటే
మన సింకా ఎందుకో నమ్మి రాజీపడలేకుంది
మీ కప్పుడే అంతవయసు మీదపడిందంటే
మాటల కోసం మూగ భావనేదో తడుములాడుతోంది

మీకూ నాకూ పదేళ్ళ వారా
వయసు ముంపు నన్ను ముంచేస్తోందేమోనన్న భయం చహారా

మలిసంజెలను చూడలేని మదరాసు నగరంలో
ఎన్ని సాయంతనాలను నిత్యం అలలు మోసి తెస్తుంటే చూశాము!
మను సమాజ పరమాణు సమూహంలాంటి సముద్ర సైకతాల్లో
ఎన్ని విన్యాసాల నురగల్తో కాలజలధి మన కాళ్ళను తడిపేస్తుంటే సంబరపడ్డాము!

ఎన్ని రసవత్ కాంక్షలు, ఎన్ని రసవత్తర చర్చలు
ఎన్ని భవిష్యత్ స్వప్నాలు, ఎన్ని బంగారు ఊహలు!!

మీరు చూపిన నన్నెచోడుడు నన్నింకా వెంటాడుతూనే ఉన్నాడు
తొలి టెస్టు మార్కుల ప్రశంసా పత్రంతో అనునిత్యం వెన్ను తడుతూనే ఉన్నాడు

మీరు నూరిపోసిన పరిశోధనావ్యగ్రత పదఘట్టనల్లో నా కవి నలిగిపోయాడు
షెల్లీని వెదుక్కొంటూ సాగిపోయే యువకుడు మద్రాసులోనే నిద్రపోయాడు

భాషాశాస్త్రం కోసం తంగిరాలన్నయ్యను వదిలి పూనా చేరాడు
అక్కడ మీరు లేనందుకు అప్పట్లో పరిశోధనకే స్వస్తి చెప్పాడు.

చదువుతున్న రోజుల్లో అయిదెప్పుడవుతుందా అని ప్రతినిముషం ఎదురు చూసేవాడు
ఎదుట ప్రొఫెసరమ్మట ప్రై కాప్టు రోడ్డులో చలం ఓల్డ్‌హోర్స్‌తో మీరు వెళ్తుంటే
నిశ్శబ్దంగా వెంటాడేవాడు
వీథి మలుపు తిరగ్గానే మీ ప్రక్కన చేరేవాడు
వదిన గారిచ్చిన టీ తో హుషారెక్కేవాడు

'తమ్ముడా!' అని ఎదురైన వాళ్ళ పలకరింపు
ఎద అడుగులో ఏదో సడి, జలదరింపు.

మాస్టారూ! మీ రనే అద్దంలో నా గతం నిత్యం నాకగుపడుతుంది
మీ సాన్నిహిత్యంలో రూపొందిన పొగరు పరువం చిలిపిగా పలుకరిస్తుంది
హృదయంలో తారాడే అంతర్నాదం క్రొత్త శబ్దాలను తొడుక్కుంటుంది
ఒకప్పటి లక్ష్మి-నారాయణుడు ఎదురై కరచాలనం చేసినట్లుంటుంది.

ఏదీ! ఏదీ! వాడి జాడ
ఎవరికైనా ఇప్పుడు గుర్తు దొరుకుతాడా?

ప్రతి మంచి మాస్టారూ ఎదిగిన వ్యక్తిత్వాలకు ఒక అద్దం
ఎదుగుతున్న వ్యక్తి చిత్రాలకు సరిహద్దులు తెలిపే చత్రం
ఎదగడమంటే ఏమిటో తెలిపి ఎదిగే జీవనదీప్రవాహం
ఎదలు కలబోసుకొనే మానవతకు అందుబాటులోని జీవత్ దృష్టాంతం.

మీ రాసిక్యాలు ఎన్నుంటేనేం? నిజంగా మీరు మంచి మాస్టారు!
ప్రెసిడెన్సీ ప్రాంగణంలో తిరిగే స్టారు, ఒక్కరే మా మాస్టారు!

అలనాడు జీవితాలను తిరగేసిన అరణ్యాల్లో
కన్నబిడ్డలా సాకి బోధించే గురువు పితృసదృశుడు
అంతశ్చేతనా సాధనలో బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు
ఇల - నేడు - తిరగబడే జీవనారణ్యాల్లో

అయిన వాళ్ళందరికీ దూరంగా వచ్చిన పసిహృదయాలకు తొలి స్నేహితుడు
హృదయాలకు మూర్తి మత్వమిచ్చి ప్రగతి పథంలో నడిపించే హితుడు.

గురుపథ నిర్దేశకుడు
గుణీభూత విజాత్మవ్యంజనుడు.

మాస్టారూ! మీ సాఫల్యానికి కీలకం స్నేహం
దానికే ఇపుడు జరుగుతున్న గురుపూజా సత్కారం
భౌతికంగా నే నక్కడ లేకపోవడం నా దురదృష్టం
మానసికంగా దృష్టమవుతూనే ఉంటుంది ప్రతిదృశ్యం!

రానందుకు నన్ను మన్నించండి
అందరిలాగే నన్నూ దీవించండి!



# సూనృతాలు

–'విశ్వసాక్షి' డా॥ పి. బి. శ్రీనివాస్

త్రిమూర్తులే గురువులందఱికి ఆదిగురువులు!
సమర్థ గురుత్రయానికి ముందు ఎల్లరూ లఘువులు!!

జ్ఞాన గంగోత్రి పావనమైనది; జ్ఞానులకు లేవు కరువులు!
గానకళామూర్తులు సప్తస్వర వరదాయక సురతరువులు!!

విశాల కీర్తులు కళాకారులు; కళారాధనా నిరత సుజనులు!
విశ్వమిత్రులు హర్షప్రదులు, పలు సాధనలను నెఱపెడి ఘనులు!!

స్వరగిరి శ్రీనివాస దాసులు నిత్య సంతృప్తి సుధాభరితులు!
గురువులు ఎల్లరికిని సన్మార్గము జూపు విద్యాధినేతలు!!

కోట్ల సుఖాల్ అందించు సత్కాళల కగణితములైన శాఖలు!
కలత ఊబిలో చిక్కుకున్న మదిలోన పెరుగునవి చీకటులు!!

కలుగవు శంకలు లేనివారికే విశ్వాసములో చీలికలు!
చింతలు లేకయె జీవించుటకై ప్రయత్నించేరు మనుజులు!!

చిత్తమలరగా రసమయ కవితలె వ్రాయగోరెదరు సుకవులు!
కవిత లారాధ్యభావము లొసగగ, సమున్నతములగు నభిరుచులు!!

కళలే రేవులు, తామై పిలువగ దరిజేరు నెల్ల నౌకలు!
జ్ఞానప్రద కీర్తనల స్థాయికి ఎదగాలి కవుల తలపులు!!

మానవుల జన్మలుత్తమమైనవి, సాధించగ ఘనసాధనలు!
మ్రోగేటి జయ్‌జయ్ ధ్వానాలందుకో గలరు కళాభిజ్ఞులు!!
సాగుత మహోత్సవాలు సంతతము, సంతసించగా రసజ్ఞులు!!!



# 'శిష్య వశంకరం'

-డా॥ జె.వి. సత్యవాణి

శంకరం శుభంకరం శిష్యవశంకరం
పలికేది పలికించేదీ మీరన్నప్పుడు
పొగడ్త కాదిది మదిలోతుల్లో
ఉండే మమతానురాగాలు తప్ప

అభిమానం పొందటానికి దారి
ఏదంటూ? ఒక్కసారి నన్ను నేనే
ప్రశ్నించుకున్నా - ఒంటరి క్షణాల్లో
ఒక్కగతే దానికి - అభిమానం పంచడం
అన్నది... ఏదో సంస్కారానుగత అనుభవం.

అనుభవం అందరిదీ ఒకటికాదు
అన్ని చోట్లా ఒకటి కాదు

ప్రతివ్యక్తి జీవితంలో ఏదో క్షణం
నిన్ను మర్చిపో... నన్ను పట్టించుకో
అనే ఆలోచన ఏదో రూపంగా
నాలో గగనతలం దాకా విస్తరించి
విశ్వరూపం ధరిస్తుంది

ఆ రూపం మీరైతే మాష్టారూ!
కారణం వెతకడానికి కష్టపడను నేను
పాతికేళ్ళ క్రితం పాఠం నేర్చుకుంటే
మాత్రం వెతుక్కుంటూ రారెవరూ
పదేళ్ళ క్రితం సహాయం పొందితేనే
ప్రతిక్షణం గుర్తుంచుకో రెవరూ

మరెందుకని

మీరు మాత్రం హృదయాల్లోనే
కాదు – ఆలోచనా స్రవంతిలో
ప్రయాగలో సరస్వతిలా చోటు చేసుకున్నారు?

అదిగో! అదే!

మళ్ళీ మొదటి కొస్తున్నా
మనస్సులో స్థానం ఎందు కెవరి కిచ్చామో
మా శిష్య వర్గానికే తెలుసు!

అందుకే!

ఒక్క మాట అంటున్నా
''శిష్యవశంకరం'' అని
మీ శిష్యరికానికి గర్విస్తున్న
సత్యవాణిని!



గీటురాయి (కావ్య సమీక్ష) :

# త్రివేణీ సంగమం 'త్రివేణి' ఖండకావ్యం

కవితాకన్యకు దుగ్గిరాల సోదరకవులు (అన్నగారు దుగ్గిరాల వెంకట కృష్ణమూర్తి, తమ్ముడు రామారావు) అల్లిన ముచ్చటైన మూడు జడలు త్రివేణి కావ్యం! యతి ప్రాసల దైన్యం లేకుండా ధారాశుద్ధితో అక్షర రమ్యతతో పద్యాలు హృద్యాలుగా ఉన్నాయి. తిరుపతి వెంకటకవుల పద్యముల ఒడుపు కొంత ప్రస్ఫుటంగా ఉన్నా, కొన్ని చోట్ల తిరుపతి కవుల పద్యాలకు అన్నలై ఉన్నాయి! కృతజ్ఞత పద్యాలకంటె అంకిత పద్యాలు అందంగా వున్నాయి- సౌందరనంద అంకిత పద్యాల ఛాయలు కన్పిస్తున్నాయి! అయినా ప్రత్యేకత లేకపోలేదు!

ప్రాచీన సాంప్రదాయ సంస్కారాల పట్ల వీరికున్న అభిమానాన్ని వీరి 'నివాళి' ఖండికలోని పద్యాన్ని బట్టి గ్రహించవచ్చు. ఆత్మ పరిచయాత్మకంగా

**వాసము 'నందమూరు' సహవాసులు వెల్మదొరల్ కవిత్వ మ**
**భ్యాసము, పొట్టకూటికయి ఆంగ్లము నేర్చి, స్వజాతి యోగ్యమౌ**
**వేసము మార్చికొంటి, మవివేకము సైచుము దండమో ప్రభూ!**
**దాసులొనర్చు నేరములు దండముతో సరి! వేంకటేశ్వరా!**

పై పద్యంలో మొదటి మూడు పాదాలూ సహజ సుందరంగా సాగిపోయాయి! చివరి పాదంలో కవిత్వం మెరుపులా మెరసింది! ''అంకితం'' - ''విశ్వాసం'' అను పద్యాలు ఒక విధంగాను, తక్కిన పద్యాలు మరొక విధంగాను కన్పిస్తున్నాయి. 12వ పుటలో ''ఏ పని చేసికొన్న'' అను పద్యంలో పితృఋణం పూర్తిగా తీర్చుకొన్నారు. స్వర్గస్థుడైన తండ్రిని మబ్బుల చాటునుండి మెరపుగా కన్పించి కవితను అందుకోమని అడగటం జాలిని కలిగిస్తుంది!

'విశ్వాసం'లో 1వ పుటలో కవితాసతి పాదముద్రలు కవియొక్క హృదయ గేహానికి ఎత్తిన దీపికలైనవట! ''హృదయంలో శతనందనాలు కుసుమించాయి'' అనటం, ''భావనాలోక తరంగ డోలికలో ఊగుతూ, నిద్రలో నవ్వుకొనుట''లో కవిత్వం చిమ్ముతోంది! పద్య రచనలో ఆసక్తి కల్గటం పురాకృత సుకృత ఫలంగా వీరు భావించారు.

2వ పుటలో ''నిగమమ్ముల్'' అను పద్యంలో-వేద జడులకు కవిత్వం చాలా దూరం. ''కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్'' అను భావానికి అనుగుణంగా లేదు! కవితాసతి చూపులు కోరుతూ ఆమెను ''పురాకృత తపఃఫలమా!'' అని సంబోధించుటలో వీరికి కవిత్వం పట్ల ఉన్న ఆదరణ అభివ్యక్తమౌతుంది!

3వ పుటలో ''నన్ను వరించి'' అనే పద్యంతోపాటుగా చాలా పద్యాలు ''కవితా!'' అని సంబోధించకపోతే ఒక యువకుని విరాళి వ్యాహారంగా ధ్వనిస్తుంది! కవితాసతి జాణతనాన్ని మెచ్చుకోవటం, ఆమె నాట్యవేదిక తమ రసనాంచలంగా సంభావించటం జరిగినప్పుడు, భువి, దివికాక మరేమౌతుంది?

4వ పుటలో ''నీ ఋణము'' అనే పద్యంలో ''కంజభవుడేని తప్పు పట్టలేడు'' అన్నారు. వీరి కవిత వ్యాకరణ సమ్మతం ప్రామాణికం! చిననాడె వలచి వచ్చిన కవితా వాల్లభ్యం ఉండగా ''ఏమియు తెలియదు'' అనుట వీరి వినయ సంసూచకమే కాని యథార్థం కాదు! కవితాసతి ఎన్ని అందాలతో సాక్షాత్కరిస్తూ వీరిని వ్రాయిస్తోందో, ఒక పద్యంలో పేర్కొన్నారు. 5వ పుటలో నా దగ్గర ఏ శక్తులూ లేవు! నన్ను ఎందుకు ప్రేమిస్తున్నావు? అంటారు. అదేకదా నిర్వ్యాజ ప్రేమ! ''ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను'' అన్న ప్రశ్నకు సమాధానం దొరికితే సముచిత ప్రేమ కానే కాదు! కవితాసతి వీరి పురాకృత తపః ఫలంగా లభించిందని ముందుగా అన్నమాట యథార్థం! ''నేనొక''-''కాంచనగర్భ'' అనే పద్యాలు ఈ కవుల వినయ సంసూచకాలు.

6వ పుటలో ''జిలుగు'' అనే పద్యంలో కవులు తమ శృంగార వర్ణనా సామర్థ్యాన్ని సాత్విక అహంకారంతో పేర్కొన్నారు. కవితా సామర్థ్యం విద్యలు నేర్పటం వల్ల రాదనీ, పద్య చరణాలే సరస్వతీ చరణాలుగా భావించే సంస్కారమే శారదా శరణాగతి కల్పిస్తుందనీ వీరు అంటారు. ఇదే భావాన్ని జాషువా కవి:

**''చదువ వచ్చు గ్రంథ సముదాయమంతయు**
**కృతులలోని నెరసు లేరవచ్చు!**
**రసము సృష్టిచేయు ప్రజ్ఞా విశేషమ్ము**
**సాధనమున రాదు! చదువు కాదు!!''** అని ఎలుగెత్తి చెప్పాడు.

7వ పుటలో ''గాలికి'' అనే పద్యంలో తమ కవితా గుణాలు పేర్కొన్నారు. ''కోరికతీరు'' అనే పద్యంలో అహంకారాన్ని పూర్తిగా తుడిచి వేసుకొన్నారు. ''అల్లన''

అనే పద్యంలో కవితాసతి తమ ఉల్లము దోచుకొన్న తీరు వివరించారు. కవితా నిర్మాణ చాతుర్య మబ్బినవాడు రాజ్య వైభవాన్ని కన్నెత్తి చూడడు! అదే పుటలో గోదోహనానికి వలెనే కవిత్వానికి కూడా వేళలుంటాయనీ, కొన్ని వేళలలో కవిత్వం రాదనీ, కొన్ని వేళలో కవిత్వం ఆగదనీ స్పష్టీకరించారు!

9వ పుటలో కవితాసతి ఎన్నో అగ్నిపరీక్షలు చేసి తమ దరి చేరిందని ఈ కవులు పేర్కొన్నారు. ఆ క్షణంలో గుండెలు రెండూ ఏకమై గుసగుసలాడుకొన్నాయట! తదారభ్య ''కూకుండ నీదురా కూసింతసేపు'' క్రమంగా కవితాసతితో తాదాత్మ్యం చెంది ''తత్త్వమసి''యై తమ అస్తిత్వాన్ని కోల్పోయారట! వీరు తెలిమబ్బుల రాతి తిన్నెలపై కూర్చుండి, నక్షత్ర పుష్పోద్యానంలో కవితా సమాధిలో ఉన్నవేళ, ఎలాంటి కవితా సుధ వర్షిస్తుందో అది ఊహల కందరానిది! ''అతి చతుర కవేః సృష్టిరప్యుజ్జితోర్వీ ప్రాప్య వ్యోమ్నాంతరాళం పునరపి సహసా విందతే పూర్వ ముర్వీం'' అన్న ఆలంకారిక నిర్వచనానికి వీరి భావుకత ఉదాహరణం! ''కవి-కవిత''- ''సోహంగా'' మారిన వేళలో బ్రహ్మానంద సబ్రహ్మచారియైన కవిత తప్పక ఉత్పన్నమౌతుంది!

10వ పుటలో శారదాభ్ర అశ్వాల స్వారియే కవితా నిర్మాణం. అది హిమాలయోన్నత శిఖర విహారం, గాంగఝరీ సదృశం అవుతుంది- అంటూ ఆత్మవిశ్వాసాన్ని ''విశ్వాసం''లో వెలువరించి ''శత జన్మమ్ములకైన'' కవిగా పుట్టాలనీ, అదే రాజ్యభోగాధికం అవుతుందనీ పేర్కొన్నారు. అవును మరి! ''సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్?''

''నిశ్వాసం''లో (11వపుట) కవితా లతాంగికీ అర్ధాంగికీ పోటీ వచ్చింది. ''ఇతికర్తవ్య విమూఢు'' డయ్యాడు కవి. శరీరాన్ని ఒకామె, మనస్సు మరోఆమె ఆక్రమించారు. జీవితాంధస్సులో కవిత, ప్రభాత సంధ్యే అయినా, వివాహమయ్యాక కవికి వీలు చిక్కటం లేదన్నమాట. వీరికి విద్యాభ్యాస కాలంలో పద్యం మద్యంలా అలవాటైంది. సంసార భారం మీదపడింది. అయినా మ(ప)ద్యాసక్తుడికి సంసారం పట్టనట్లే కవికి సంసారం పట్టలేదు. సంసార బాధ్యత తప్పదు. ''గీతమల్లిక బ్రతుకు సాగింపలేను'' అన్నట్లుగా కవితా వ్యాసంగాన్ని సాగించకుండా ఉండలేడు కవి! ఈ ద్వైతంలో కవి కొట్టుమిట్టాడాడు. అన్నదమ్ములు, బంధువులు, భార్య, ఇతని ప్రవృత్తికి స్వగతంగాను, ప్రకాశంగాను, బాధపడ్డారు. కవి, కవితాసతి యెదుట నిశ్వాసము చేశాడు! తన కవితా వాల్లభ్యానికి మాత్రం దూరం కాలేదు! కవితావల్లరి వీరి మనస్సుల్ని

ఎంత ప్రగాఢంగా అల్లుకుందో మనం అర్థం చేసికోవచ్చు. కవిత్వం అల్లుకొనే వేళ లోకమే కన్పించదట. కవితాసతీ సాక్షాత్కారవేళ -

**నీ యానంద ముఖావలోకనమునన్ నిర్మగ్నమై యున్నచో**
**నా యిల్లాలును నాదు సంతతి మరిన్ నాతల్లి నా తమ్ములున్**
**నా యన్నల్ కనుపింప రాక్షణమునన్ నా దృక్పథమ్మందు, ఏ**
**మో! యే మందిడి బుద్ధి మార్తువొ; కవిత్వోన్మాదినై పోవుదున్!**

కవితా తాదాత్మ్యము సిద్ధించిన వేళ లోకాలోచనము తొలగిపోవుట సహజమే కదా! తనను పిచ్చివాడని లోకం అంటున్నందుకు కవి ఆవేదన పడటం లేదట! ఆలు తెగనాడిందని ఆవేదనయట!

**''అందరు అందురంచు హృదయమ్మున నే పరితాపమంద; నా**
**కందరి గోల యేల?................ఇంకనే**
**మందును? కట్టుకొన్న ప్రియురాలు ననున్ తెగనాడిపోసెడిన్!''**

ఈ నిశ్వాసంలో, ధన హీన స్థితిలో ఉన్న కవి కవిత్వం వ్రాయటంలో నిమగ్నుడై వుంటే అన్ని ప్రక్కలనుండీ అతనికి ఏర్పడే బాధలు 14వ పుటలోని సీస పద్యంలో వివరించారు.

**''పోరులకు జీవితమ్ము కాపుర మొనర్చి**
**ఏమి సుఖమందెదను చెప్పవే లతాంగి!''**

అంటూ కవి దీనంగా కవితాసతిని ప్రశ్నిస్తాడు! ''మనసొకచోట మనువొక చోట'' అన్నట్లుగా మనస్సు కవిత్వం మీదా; కాపురం భార్యతోను - ఈ మధ్యలో, కవి పొందిన గింజులాట, ఈ భాగంలో చక్కగా చిత్రించారు ఈ కవులు!

కవితాసతీ నిరంతరచింతనం లభిస్తేనే, కవి కృతార్థుడు కాగలుగుతాడు. కవి కవితా సమాధి పయోధిలో మునిగినప్పుడే, పద్య ముక్తాఫలాలు లోకానికి అందిస్తాడు. వీరి తాదాత్మ్యం, నిరంతర చింతన తీరు, వివరిస్తూ 18వ పుటలో:

**నిలచిన కూరుచున్న శయనించిన నిద్దుర పోయినన్ భవత్**
**సలలిత రూపరేఖ లెడదన్ నటనమ్మొరించు తన్మహో**
**జ్జ్వల నటనా ప్రదర్శన మపార ముదాంబుధి ముంచివేసినన్**
**తలపగనీయదింక నిజదార సుతాదుల గూర్చి సుంతయున్.**

ఈ పద్యం చదవగానే ''సంతత శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!'' అను ప్రహ్లాదస్థితి స్ఫురణకి వస్తుంది! జ్ఞాతతత్త్వుణ్ణి లోకం ఎలా తూలనాడుతుందో **''పాలికయేండ్లు రానపుడె పట్టుకొనెన్ కవితా స్వరూపిణీ భూతము! వీనినిన్ విడిచి పోవదురా!''** అని లోకులాడు మాటలు చక్కగా చిత్రించారు.

'నీవు నన్ను పట్టుకొన్నావు కాబట్టి లోకులిలా అంటున్నారు. నీవు నన్నావహించకుండా వుంటే వాళ్ళు అనగలరా?' అంటూ కవితాసతిని వ్యాజస్తుతిగా అంటారు ఈ కవులు.

కవితా సరస్వతి కవుల కిచ్చిన సత్కారాల్నీ, తెచ్చిన కీర్తి ప్రతిష్ఠల్నీ, ఉటంకిస్తూ-

**మణులిప్పించితి వీయజేసితివి! బల్ మాన్యమ్ములన్ మత్త వా**
**రణ యూథమ్ముల నెక్కజేసితివి! స్వర్ణ స్నానమాడించి తీ**
**క్షణ మాత్రమ్మున నీ సమాశ్రితుల తత్కాల ప్రభావమ్ము ధా**
**రుణిపై నీ మహిమ ప్రసాదమని వాక్రుచ్చున్ చరిత్రాంశముల్!**

అనే పద్యంలో పేర్కొన్నారు. ఈనాటి స్థితిని ఒక్కసారి కలయచూసి ఆవేదనకు లోనయ్యారు. కవిత వినువారు కరవయ్యారు. **''కవనమ్మున్ వినుటే కవీంద్రునకు సత్కారమ్మటంచున్ ప్రజా నివహమ్ముల్ తలపోయు కాలమిది!''** - **''కవియన్నన్ కవికే అనిష్టమట దుర్గర్వం బహంభావమున్ కవి క్షత్రంబగు లక్షణంబులట!''** అంటూ ఆవేదనతో నిశ్వసించారు. ప్రాచీనకాలంలోని **''ఏనుగు నెక్కజేయుమనియే నినుగోరను పట్టుశాలువల్ కానుక లగ్రహారములు కంకణశ్రీలను కోరను''** అన్నట్లుగా నిరుపహతి స్థలం అక్కర్లేదు. రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చే కప్పుర విడెం అసలే అక్కర్లేదు. భోజనము, ఒప్పు తప్పరయు రసజ్ఞులు, ఉంటే చాలు! కాలం దొర్లించేస్తాము- అంటారీ కవులు! వీరి గురువులు తిరుపతి కవులు **''కవితా మాధురి తాగ్రహించి యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబుగాదు! విశేషంబిట నిర్విశేషమిట, మాధుర్యంబిటన్ వహ్వారే! కవిరాజా! అని మెచ్చి యిచ్చు నృపుడు''** ఒక్కడుంటే బ్రతికేస్తాము అన్నారు. కనీసపు కోరిక కూడా కవితామతల్లి తీరేలా చెయ్యదా?

ఈ దుగ్గిరాల కవుల కవిత్వాన్ని చూచి, మెచ్చదగినచోట మెచ్చిన చాలునట! అదే గజారోహణ, కనకాభిషేక, ఆందోళికారోహణాలుగా సంతుష్టి పొందగలం! అంటూ -

ప్రాసిన దాని జూచి సెహబాసనినన్ కనకాభిషేకమున్
చేసినయట్లు - కంకణము చేతికి వేసినయట్లు - పల్లకీ
మోసినయట్లు-డెందము ప్రమోదము చెందును'' అంటారు.
''ఎంత చక్కగా ప్రాసిన ఈసడింతు రవురా! సమకాలికు లేమి కర్మమో!''

అని వాపోయారు! అది సమకాలిక ధర్మం అంటూ ఏనాడో చేమకూర కవి ''ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!'' అంటూ సమకాల ధర్మాన్ని చెప్పాడు. ఎన్ని బాధలు విరుచుకు పడినా; ఎన్ని రాళ్ళు మీద పడినా; ఎన్ని కష్టాలు ముట్టడించినా కవిత్వాన్ని అల్లకుండా వుండలేను! హిమాలయ ఉత్తుంగ శిఖరాగ్రాల నుండి పడే ప్రవాహాన్ని ఆపలేను! ''ఆపగలను''! అనటానికి నేను సర్వజ్ఞుణ్ణి (శివుణ్ణి) కాను! అంటూ -

గగనోత్తుంగ హిమాలయాద్రి శిఖరాగ్ర ప్రాంత నిర్యత్సురా
పగ భంగిన్ తెగపొంగి వచ్చు కవితా స్వర్వాహినీ వేగ మా
పగ నా శక్యమె? శక్యమంచనగ సర్వజ్ఞుండనే? నాడు నీ
మొగమున్ జూచితి మోసపోయితిని! వ్యామోహమ్ము ద్రోహమ్మగున్!

అంటూ వ్యాజస్తుతిగా నిశ్వసించటంతో ఈ భాగం ముగుస్తుంది.

## ఆశ్వాసము:

కవిత్వ తత్త్వము అర్థమైన తరువాత కవికి మనస్సులో ఒక కొలబద్ద (మీటరు) ఏర్పడుతుంది. వచ్చిన కవిత్వంతో సరిపుచ్చుకోలేడు. ఈ స్థితిలో ''స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం'' అన్నట్లుగా గర్వించలేడు. నేను వ్రాస్తున్నది కవిత్వమా? అనే ఆత్మ విచార మేర్పడిన వేళ తనను శంకిస్తున్నాడనుకొంటుంది కవిత. పూర్వం మాదిరిగా దరిచేరదు. ఈ స్థితి నవ కవితా మహోదయానికి నాంది. ముందు మెట్టు. నవ కవితా వసంతానికి ముందున్న శిశిరం. ఈ ఆశ్వాసంలో అలాంటి శిశిరం కవిని ముసిరింది. కవితాసతి దుఃఖిస్తూ ఈ ఆశ్వాసంలో సాక్షాత్కరిస్తుంది. ఆమెను ఓదార్చి, ఆమెతో అద్వైతాన్ని పొంది కవితా నవవసంతంలో నవ్యకవితా స్వరూపుడుగా సాక్షాత్కరిస్తాడు ఈ కవి.

''ఎవ రేమనినారని వెక్కి వెక్కి యేడ్చెదవు లతాంగి!''
''రోసంబూనితివా? అదేయయిన గూలున్ నిల్వునన్ వీని యాశా సౌధమ్ములు!''
''తప్పు దిద్దుకొనగా శాసింపు మీ దాసునిన్!

కవిత్వతత్త్వ విచారము మొదలు కాగానే కవితాఝురి ఆగిపోవును. ''పిచ్చుక, హంసయానమును వేడుకతోఁదగ నభ్యసింపగా, వచ్చిన పూర్వపున్నడల వైఖరి పోయెను. హంసయాన మా పిచ్చుక కబ్బదయ్యెను.......గెంతుచునుండె నేటికిన్''. కవిత్వమునకు తానేర్పరచుకొన్న నియమాలకు జంకి కవిత్వం దగ్గరకు రావటం లేదు. ఆమెను ఓదార్చుతూ బ్రతిమాలుతున్నాడు కవి. ''కలమును బట్టి పట్టుకుని కందము కూడ రచింపనైతి. నీ వలపుల తోడు! ఇంత బలవంతపు శిక్షలకేమి చేసితిన్?'' అని తన అశక్తతను వ్యక్తం చేస్తాడు. తెలియటం కూడా భయమే! అజ్ఞానంగా ఉన్న రోజుల్లో ఉండే చొరవ జ్ఞానంలోకి వచ్చాక ఉండదు కదా! శ్రావణ నదీవేగం శరదృతువులో మందగిస్తుంది. అయినా కవిత్వాన్ని ''పుట్టు కవి'' విడచి పెట్టుకోలేడు. అందుకనే కవి ఎలా ఆవేదన పడుతున్నాడో చూడండి:

''విడివడనట్టి నీదు మురిపెంపు సుతారపు కౌగిలింతలన్
విడచుట యెట్లు? నీదు శ్రుతిపేయ సుధామధురానులాపముల్
విడచుటయెట్లు? గాఢమగు ప్రేముడితో మన రెండు గుండెలున్
ముడివడిపోయె! త్రెంచుకొని పోవుటయెట్లు? కళా విలాసినీ!'' అంటాడు.

కవితా సామ్రాజ్యం ఏలేవాడికి నిత్యావసరాలు కూడా కన్పించవు. ఆ కవిత్వంలో మున్కలు వేస్తూ ఆ సామ్రాజ్యాన్ని ఏలుతూ కవి, ''రాజు'' ననుకొంటాడు. కవులను దరిద్రం పట్టుకోవటం పరిపాటి. లెక్క చెయ్యకపోవటం కవుల అలవాటు. కవి తన ఊహా ప్రపంచంలో సుఖించగలడే కాని వాస్తవ జగత్తులో సుఖించలేడు. ఈ విషయాన్ని జాషువా కవి:

''ఎవడు సుఖించెనో తెలుపు మీ కవితాకళ నభ్యసించి? భా
రవి భవభూతి మాఘకవి రాజులుగోలె మదాంధ్ర సత్కవి
ప్రవరుల దాక, పొట్టకును బట్టకు చాలని ఆర్జనంబుతో
నవసినవారి సంఖ్య అదనంబయి దోచు తలంచి చూచినన్'' - అంటాడు.

ఈ కవి కవితాసతితో 'తిండి-ఉండటానికి ఇల్లు - లేకపోయినా సరే! నువ్వు నా దగ్గర ఉంటే చాలు. అదే నాకు స్వర్గము. నీవు దూరమైన నాడు నాకు స్వర్భువనం లబ్బినా, నేను లేనివాడనే' అంటాడు.

ఈ కవి - లలిత కవితా కళా జలధిలో నావికుడట! కవితాసతి చుక్కాని పట్టని వేళ అతడు గట్టెక్కలేనంటాడు. తన కవితలో అంతటా తీపి ఉండటానికి సరస్వతీ అనుగ్రహమే కాని, తన తెలివి కాదనే వినయం ప్రకటిస్తాడు. ''శారదా! నా కవితపై నీవు ఎప్పటికప్పుడు నీ చెవియందలి అరవిందంలోని మధూళీ మాధుర్య క్షేపణం చేస్తూ వుండటం వల్లనే ఇంత తీపి వచ్చిం''దంటాడీ కవి.

**గిరాందేవీ సద్యః శ్రుతి కలిత కల్హార కలికా**
**మధూళీ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ!**

అనే శ్లోక పాదాలు ఈ సన్నివేశంలో గుర్తుకొస్తాయి. కవి, కవితాసతిని ఎన్నో రీతులుగా బ్రతిమాలుతూ వుంటాడు. తన కృషికి కాలం కలిసి రావాలి కదా! మనోమథనం నుండి పుట్టిందే కవితామృతం. కవి యొక్క అంతర్మథనంలో నుండి, కవికి నవకవితా వసంతోదయమైంది. కవితాసతీ ముఖచంద్రునిలోనుండి దరహాస చంద్రిక లుదయించాయి. కవి హృదయం చల్లబడింది. అంతవరకు చీకటిగా ఉన్న (కవి యొక్క) హృదయ వీధులు తెల్లవారాయి. నూతన భావ భాస్కరోదయం అయింది. ఆ సందర్భంలో ఆనందంగా చెప్పిన పద్యం:

**''అదిగో! తూరుపు తెల్లవారినది, సంధ్యా రాజ్ఞి పారాణి కాం**
**తి దిశామండల మాక్రమించినది, ఇంతీ! నవ్వుచుండెన్ నవా**
**భ్యుదయమ్ముల్; తరుణార్కులేత కిరణమ్ముల్ పద్మినీకాంత క**
**న్నుదలన్ రేపెడి మన్మథాగమన సంతోషం బశేషంబుగన్''**

అందరూ కవిత్వం చెప్పలేరు. అన్ని పక్షులూ పంచమస్వరం ఆలపించలేవు. కవితా వసంత శుభవేళలో కవిత పంచమస్వరంతో శ్రుతి కూర్చుకొంటోందట. కవితా స్వరూపంగా మారిన కవి, తమితీవల పందిరి నీడలలో రాజై కొలువుతీర్చుకొన్నాడు:

**కూ! యని కూయు కోయిలల కూతలలో మొలకెత్తి సాగి, సం**
**దీయక-యల్లుకొన్న తమితీవల పందిరి నీడలందు ఆ**

ప్యాయముతోడ నేను దొర్దై కొలువుందును! భారతీయ జా
తీయత మారుమ్రోగ శ్రుతి దిద్దుము నీ కవితా విపంచికిన్!

సరైన శ్రుతి, కవితా లక్ష్యాలు ఏర్పరచుకొన్నాడు కవి. మతోన్మాదాలు చల్లార్చు కవిత- జాత్యహంకారాలు మూలమట్టం చేసే కవిత- దురాచారాలు దూరం చేసే కవిత - నియంతృత్వాన్ని నిర్మూలించేసే కవిత - సరస్వతీ కటాక్షంతో తనకు సంప్రాప్తించాలని కోరుకొంటాడీ కవి.

చిన్నారి పాపాయి చిరుత నవ్వులు - పున్నమ వెన్నెల అమృత స్నానాలు, కలికి వాల్చూపుల ఒయ్యారాలు - మల్లెపూల గుబాళింపులు తమ కవితలో ప్రతిపదం సాక్షాత్కరించాలని ఆకాంక్షిస్తాడీ కవి. తన కవితను ఆదరించుటకు ఈనాడు మహారాజులు లేరు కదా! ఎవరు పోషకులు? అని ఆలోచించి తన కవిత జన బాహుళ్యములో విస్తరిస్తుందని ఆశిస్తూ ఆత్మవిశ్వాసంతో - ఓ కవితా వధూమణీ!

''జననాథావళి కొల్వుకూటముల సంచారించు నీ పాదముల్
జనబాహుళ్యములో చరించుచు, నమస్కార ప్రసూనార్చనా
ఘన సత్కారములందుకొంచు కవితా కల్యాణి! ఈ రోజులం
దున త్రైలింగ గృహాంగణావళులయందున్ సంచరించున్ జుమీ!''

అని కవితాసతిని ఆశీర్వదించి ఆశ్వాసించటంతో ఈ ఆశ్వాసం పూర్తి అవుతుంది.

కఠిన పద భరిత దీర్ఘ సమాస విన్యాసమే ఆంధ్ర కవిత్వానికి ప్రధానలక్ష్యం అనే భావాన్ని పోగొట్టి, పద్యభీతిని సామాన్య ప్రజలలో తొలగించి, ఛందోబద్ధ కవితను జనముద్దు చేసిన తిరుపతివెంకటకవుల ఛాయలో సాగు కవిత పట్టుబడిన ఈ కవులు ధన్యులు! కాపీలు కరవైన ఈ త్రివేణిని జిరాక్సు కాపీలో చదువు భాగ్యము కల్పించిన చిరంజీవి రామారావు బావగారికి నా కృతజ్ఞతాపూర్వక ఆశీస్సులు!

– తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు

(ప్రతులు కరవైన ఈ రసవత్కావ్యాన్ని శీఘ్రమే పునర్ముద్రించవలసిందిగా శ్రీ దుగ్గిరాల రామారావుగారిని కోరుతున్నాను. ఈ సమీక్షచదివిన పాఠకులు కూడా ఆయనకు లేఖలు వ్రాయడానికి వీలుగా వారి అడ్రసు కూడా ఇస్తున్నాను:
Sri. D. Rama Rao, H-6, Ram's Flats, No.15, Grifith Road, T-nagar, Madras - 600 017. – సంపాదకుడు)



పుణ్యపురుష సంస్మరణ:

వృత్తిరీత్యా సహకారవేత్త - ప్రవృత్తిరీత్యా సాహితీవేత్త
పూర్ణకాముడు - యోగిపుంగవుడు అయిన

## శ్రీ భమిడిపాటి గౌతమసుబ్బావధాని (1921-1997)

సదా శివధ్యాన తత్పరుడు, సాహితీ రచనాచణుడు, యోగి పుంగవుడు అయిన శ్రీ భమిడిపాటి గౌతమసుబ్బావధానిగారు తమ 76వయేట ఈశ్వర నామ సంవత్సర బహుళ దశమినాడు (1997 మే 2వతేదీని) ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందారు.

కృష్ణాజిల్లా 'కౌతరం' గ్రామంలో, గౌతమేశ్వరస్వామి ఆశీస్సులచే జన్మించిన గౌతమసుబ్బావధానిగారికి, జన్మనిచ్చిన తల్లిదండ్రులు పిచ్చిరామమ్మ, భమిడిపాటి కామయ్యశాస్త్రిగారలు. విద్యాభ్యాస కాలంలో బందరు హిందూకళాశాలలో విద్య

నెఱపిన గురువులు శ్రీ చోడవరపు జానకిరామయ్య, శ్రీ గోఖలే, కవిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావు, కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారలు. ఉద్యోగం చేస్తున్న కాలంలో కవితాగురువులు శ్రీ కొమ్ము సోమేశ్వరశర్మ, మరియు శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు గారలు (వీరు ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్త, కవి, విమర్శకులు అయిన ఆచార్య తంగిరాల సుబ్బారావుగారి అగ్రజులు).

అన్యాయ మనినంతనే భగ్గుమనెడి స్వభావం కలవారు శ్రీ అవధాని. సుమారు 40 సంవత్సరాలు కో-ఆపరేటివ్ శాఖలో పనిచేసి, చివరకు డిప్యూటీ రిజిస్ట్రార్‌గా పదవీవిరమణ గావించారు. ఆ డిపార్టుమెంట్‌లో వీరు నిజాయితీకి మారుపేరుగా నిలిచారు. వృత్తిరీత్యా ఉద్యోగంలో మంచి కీర్తి ప్రతిష్ఠలు గడించినా, వీరి పూర్తి ఆసక్తి, అభిరుచి సాహిత్యంపైననే ఉండెడిది. అవధానాలను నిర్వహించుట అనిన వీరికి వెన్నతో బెట్టిన విద్య. దేశంలో ప్రసిద్ధి వహించిన అవధాన శేఖరులు శ్రీ కొప్పరపు సీతారామవరప్రసాద్, శ్రీ పేరాల భరతశర్మ, శ్రీ డా॥ ఎస్. జనార్ధనరావు, శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు మొదలగువారిచే స్వగ్రామం కృష్ణాజిల్లా కైకలూరులో అష్టావధానాలను చేయించి వీరు అధ్యక్షులుగా నుండేవారు. వీటి అన్నింటియందును ప్రోత్సాహకులు, ప్రసిద్ధ పృచ్ఛకులు, వీరి గురువర్యులు శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారే.

ఆకాశవాణి వారి సమస్యాపూరణంలో అవధానిగారు నిరంతరం పాల్గొనెడివారు. వీరు ''కైకలూరు సాహితీ సమితి'' అను సంస్థ నొకదానిని స్థాపించి, శ్రీ సోమయాజులుగారు రచించిన ''కీరకోకిలము'' - ''కాఫీశతకము'' మొదలైన పద్యకావ్యాలను ప్రచురింపజేశారు. పదవీ విరమణ అనంతరం (1977) వీరి సాహిత్యాభిరుచి, రచనా వ్యాసంగం ఇనుమడించాయి.

''ఆయురారోగ్య భోగ భాగ్యముల నిడుత, శ్యామ సుందరి జనని శ్రీ శ్యామలాంబ'' అనే మకుటంతో ''శ్రీ శ్యామలాంబా త్రిశతి''ని (శతకాలను) రచించారు. కలిదిండి గ్రామమునకు సమీపమున పొలములలో వెలసియున్న శ్రీ పాతాళ భోగేశ్వర స్వామివారిపై ''శ్రీ పాతాళ భోగేశ్వర శతకము''ను రచించిరి. (కోడికూత-రోకటి పోటు ఈ స్వామికి వినిపించకూడదట). తదనంతరము ''గాయత్రీ శతకము''ను రచించిరి. శ్రీ తులసీదాసు హిందీలో రచించిన ''శ్రీతులసీదాసు రామాయణము'' ను వీరు పద్యములలో తెనుగు పద్యకావ్యముగా

అనువదించిరి. తమ గురువులైన శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారితో కలిసి, భద్రాద్రికి (భద్రాచలమునకు) పోయి, గురువులకు ఆ కావ్యమును వినిపించి, శ్రీ సీతారామచంద్రులకు ఆ కావ్యమును అంకితమొనర్చిరి. హిందీ రాష్ట్రభాషా ప్రవీణయందు ఉత్తీర్ణులగుట వీరికీ అనువాదము చేయుటలో మిక్కిలి ఉపకరించినది.

వేదాధ్యయనమునందు వీరికి అనన్యమైన ఆసక్తి ఉండెడిది. శ్రీ అవధానిగారు ''శుక్లయజుర్వేదమునకు తెలుగులో వ్యాఖ్య'' రచించిరి. తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఈ కృతి ముద్రణకు ఆర్థిక సహాయమును మంజూరు చేసిరి.

వీరి భక్తితత్పరత ఎనలేనిది. ప్రతివత్సరము శివనామ సప్తాహములను నిర్వహించి శివపార్వతీ కల్యాణమును జరిపించెడివారు. జ్యోతిశ్శాస్త్రము నందు కూడ వీరికి అపారమైన అనుభవము, ప్రవేశము, ఫలితములను చెప్పెడి ప్రజ్ఞ యుండెడివి. వీరు మరణించుటకు ముందు ఆసుపత్రికి వెళ్తూ ''ఈ రోజు ఆసుపత్రికి పోక! ఇక రాక లేదు'' అని స్వదస్తూరితో డైరీలో వ్రాసుకొని యుండిరి.

తెలుగు సాహిత్యముపై గౌతమ సుబ్బావధానిగారి అభిరుచి ఎల్లలు దాటినది. తనకున్న ఇరువురు కుమారులను వారణాసిలోని, కాశీ హిందూ విశ్వవిద్యాలయము లోని తెలుగు శాఖకు పంపించి ఎమ్.ఎ. మరియు పిహెచ్.డి లు చెప్పించి, డాక్టరేట్‌లుగా తీర్చిదిద్దిరి. ఇందు పెద్దకుమారుడు డా॥ సచ్చిదానందమూర్తికి పిహెచ్.డి. న్యాయ నిర్ణేతలుగా సుప్రసిద్ధ సాహితీవేత్త ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు వచ్చి పిహెచ్.డి. డిగ్రీని ప్రదానము చేసిరి. చిన్న కుమారుడు డా॥ విశ్వనాథ్ ప్రస్తుతము బి.హెచ్.యు. తెలుగుశాఖలో రీడరుగా నున్నారు. కుమార్తెలను భాషాప్రవీణులుగా అవధాని గారొనర్చిరి. ఇంతటి పుణ్యపురుషులు శ్రీ గౌతమ సుబ్బావధానిగారికి, సాహితీ నివాళులర్పించుచు, వారి ఆత్మశాంతికై ప్రార్థించుచున్నాము.

**– డా॥ భమిడిపాటి విశ్వనాథం**
బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం
వారణాసి

# కవితా లేఖలు

I. గురువర్యులు డా॥ నందూరి రామకృష్ణమాచార్యుల వారి ఆశీస్సులు - అభినందనలు

1. ఏదో ఒక ఆదర్శము
నేదో ఒక పని సమష్టి హితమునకై తా
నౌదల దాల్చిన త్యాగికి
నైదు పదిని జేసి లోక మారాధించున్.

నీవు ధన్యజీవివి. పరమ ప్రయోజకుడవు. బహుళ కర్తవ్యములు నిర్వహించుచున్న కార్యశూరుడవు. ప్రవాసాంధ్రుడుగ బెంగుళూరులో నీవు ఆర్జించిన కీర్తి పలుకుబడికి నాబోటులు గర్వించవచ్చు. నీకు నా ఆశీస్సులు. అభినందనలు...(5-11-1996)

2. (i) పండుగ దీపావళి ధాం
ధాం ధాం చంచచ్చటుల పటాటోపముగా
మండిత గగన స్ఫుట ది
ఙ్మండల కాంతిచ్ఛట మఱిమఱి మార్మ్రోగున్.

(ii) వ్యక్తి - గొప్పవాడు - వాగ్దానములు చేసి
తరచు - బ్రతుకులోన - తప్పవచ్చు
విఘ్నములకు వివిధ వికట హేతువులుండు
అతని మంచితనము నభినుతింతు.

(iii) ధనికుడైనవాడు దానాల నెన్నియో
చేయవచ్చు ఎడమ చేతితోడ
శక్తిలేనివాడు సల్పు దానము మిన్న
శీలమునకు ఆత్మ - చిత్తశుద్ధి.

చైతన్యకవితా పత్రికా
వర్ధతా మభివర్ధతామ్ -

దీపావళి శుభాకాంక్షలతో...(10-11-1996)

3. వివిధ వాద భేద విషయ విస్తీర్ణమ్ము
ఎడదలోన సంగ్రహించు కొనుచు
తత్త్వ చరితయందు - ధర్మ సూక్ష్మము వోలె
సూత్రధారి తోచు సుబ్బరావు! (27-11-1996)

4. <u>కవితా కైవల్యం - కవి దేవో భవ!</u>
కవితలు చదివిన చాలును
కవితలపై ప్రేమ చాలు - కమ్మని హృదితో
కవితల నల్లిన చాలును
కవితయె - కైవల్యమవని - కనరా సుమతీ!

''(శ్రీ) కైవల్యపదంబు కోరుటకునై'' పోతన భాగవతం వ్రాశాడు. ''కవిత నాకు కైవల్యంబే!'' - అని నేను వ్రాశాను 'ప్రగతి గీత' లో. నీవు - పోతనను నన్మ్నా మించినావు గదా! జీవితం కవితకు అంకితం చేశావు! ఏ అక్షరంలో కవిత్వం కనిపించినా నీవు ఆరాధించుచున్నావు. సంతోషం.

(1-12-1996)

5. ఓ యభిమాన సంభృత మహోదయ! సంచిక వేసి - సాహితీ
న్యాయము కూర్చినాడవు గదా! చరితార్థుడ - తెల్గులో ఉపా
ధ్యాయుడ నౌట - నా బ్రదుకు ధన్యము - శిష్యుడ వీవెగా - రస
స్థాయికి చేర్చి ఇచ్చు గురుదక్షిణ మెచ్చితి - సుబ్బరాట్కవీ!
(1-12-1996)

6. చచ్చిపోకముందె - శ్రద్ధాంజలిని నాకు
కూర్చె సుబ్బరావు సుకవి వరుడు;
సాహితీ స్రవంతి - చైతన్య కవితలో
సంచిక వెలయించి ఛాత్రసూరి.

ఆశీస్సులు... భీమవరం సభావిశేషాలు తెలుపవలెను. కీర్తిశేషులు దిగుమర్తి సీతారామస్వామిగారి పేరు నీవు నిలుపుచున్నందుకు సంతోషం.

చైతన్యకవిత సంచిక చూచిన వారందరు నీవు చేసిన కృషి చిరస్మరణీయమైనదని శ్లాఘించుచున్నారు. నా సంతోషమునకు మేరలేదు.

-నండూరి రామకృష్ణమాచార్య
సికింద్రాబాదు, 18-12-1996

II. ''వీరగాథల ఖజానా
తెలుగు సాహిత్యానికి నజరానా
పరిశోధకులకు షానామా
'తంగిరాల' ధీ నామా!''

-డా॥ జవాద్ హుస్సేన్
తిరుపతి, 12-6-1998

III. ''చైతన్య కవిత లందెను;
చేతన ముదమొందె; కృషి విశిష్టముగద!; సం
ప్రీతార్థ గౌరవైక
ద్యోతకములు కాన్కలంపుదున్ త్వరలోనే!''

-డా॥ రామడుగు వేంకటేశ్వర శర్మ
గుంటూరు,23-6-1998

IV. జీవిత సభ్యత్వమునకు
నే విత్తము పంపుచుంటి నిర్మల హృదయా!
శ్రీ వాణీ జనయిత్రిని
సేవించెడి సుబ్బరాయ! చేకొనుము నతిన్ -

-'శతావధాని' శ్రీ కొండపి మురళీకృష్ణ
కందుకూరు, 5-12-1998

విశేషవార్త:

# శృంగేరి శారదను అన్నపూర్ణగా మార్చిన శ్రీ ఆదికేశవులు

(ఓం ఐం శ్రీం హ్రీం క్లీం శ్రీ శారదాయై నమః)

ప్రముఖ పారిశ్రామికవేత్త, భక్తాగ్రగణ్యుడు, మహాదాత, 'శ్రీనివాసాట్రస్టు' అధినేత అయిన శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు ఎన్నో పుణ్యకార్యాలు నిరంతరం చేపడుతున్నారు. కోట్లకొలది రూపాయలు ఖర్చుచేసి శృంగేరి, కంచి, తిరుపతి, పుట్టపర్తి, బెంగుళూరు మొదలైన చోట్ల దేవేంద్ర భవనాలవంటి పెద్ద పెద్ద సత్రవులు, కల్యాణ మంటపాలు, భోజనశాలలు నిర్మించారు. చిత్తూరు జిల్లాలో సత్యసాయి నీటి పథకాన్ని అమలు చేస్తున్నారు. ఇటీవలే బెంగుళూరు రాజరాజేశ్వరీ దేవాలయం దగ్గర ''పద్మావతి'' ''మీనాక్షి'' అనే రెండు అతి సుందరమైన కల్యాణ మంటపాలు నిర్మించారు. వాటికి భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారు 31-10-1999 నాడు ప్రారంభోత్సవం చేశారు. శృంగేరిలో పెద్ద భోజనశాలను నిర్మించి, అందులో నిరంతర అన్నదాన పథకాన్ని ప్రారంభించారు. దానికి 4-11-1999నాడు కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ యస్. ఎం. కృష్ణగారు ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంగా శృంగేరిలో శ్రీ ఆదికేశవులుగారు చేసిన స్వాగత భాషణం ఈ దిగువ ఇస్తున్నాము.

- సంపాదకుడు

శ్రీ శృంగేరీ పీఠాధి దేవత శ్రీ శారదాదేవి పాదపద్మాలకు ప్రణమిల్లి -

పీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ స్వామివారి చరణారవిందాలకు మోకరిల్లి

కర్ణాటకరాజ్య ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ ఎస్.ఎమ్ కృష్ణగారికి-

వేదిక నలంకరించిన పెద్దలకు - ఈ కార్యక్రమానికి విచ్చేసిన సభాసదులకు- భక్తకోటికి నమస్కరించి - నేను స్వాగత అభిభాషణం చేస్తున్నాను...

## 1. ఇరవైయేళ్ళ అనుబంధం:

ఈ శృంగేరీ శారదా పీఠంతో నాకు సుమారు ఇరవైఏళ్ళనుండి ఆత్మీయమైన అనుబంధం ఉంది. శ్రీ శారదాదేవి కరుణా కటాక్ష వీక్షణాలు నాపైనా నా కుటుంబం

పైనా 20ఏళ్ళుగా అవిచ్ఛినంగా ప్రసరిస్తున్నాయి. పీఠాధిపతుల ఆశీస్సులు నాకు లభిస్తున్నాయి. అందువల్ల నా జన్మ ధన్యమైనదిగా భావిస్తున్నాను.

## 2. శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థస్వామివారి ఆశీస్సులు:

ఈనాటి పీఠాధిపతియైన శ్రీ శ్రీ శ్రీ భారతీ తీర్థస్వామివారి గురువుగారు శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామివారు (1954-1989). ఆ గురువుగారి కాలం నుండీ కూడా నాకు ఈ పవిత్ర క్షేత్రంతో అవినాభావ సంబంధం ఉంది. ఆ స్వామివారు తాము ఆంధ్రదేశానికి కాని తమిళనాడుకు కాని జైత్రయాత్రకు వెళ్ళేటప్పుడు మా చిత్తూరు పట్టణం మీదుగా వేళ్ళేవారు. అప్పుడు వారు నాకూ నాకుటుంబ సభ్యులకూ తమ దివ్యదర్శన భాగ్యాన్ని కలిగించడమే కాకుండా, వారికి ఆతిథ్యమిచ్చే సువర్ణావకాశాన్ని కూడా ప్రసాదించేవారు.

మా పెద్దమ్మాయి చి॥ తేజేశ్వరి పెండ్లికి శ్రీ స్వామివారు స్వయంగా బెంగుళూరు విచ్చేసి, నూతన వధూవరులను ఆశీర్వదించారు. దీనిని బట్టి శ్రీవారికి మా కుటుంబంపై ఎంత వాత్సల్యముండేదో ఊహించుకోవచ్చు. అంతేకాదు; నేను దివ్య క్షేత్రమైన తిరుమల కొండపై ''శ్రీనివాస నిలయం'' అనే సత్రవును నిర్మింప తలపెట్టినప్పుడు దానికి శంకుస్థాపన చేసినదీ; అది పూర్తి అయిన తరువాత ప్రారంభోత్సవం చేసినదీ శ్రీ అభినవ విద్యాతీర్థస్వామివారే. శంకుస్థాపన అంటే మామూలుగా లాంఛనంగా చేసిన శంకుస్థాపన కాదు! శ్రీ స్వామివారు స్వయంగా గడ్డపార తీసికొని, స్వహస్తాలతో త్రవ్వి, దానిలో నవరత్నాలు ఉంచి, రాళ్ళు పాతినారు. ఒక సర్వసంగ పరిత్యాగి ఈ విధంగా చేశారంటే ఎవరూ నమ్మరు. వారికి నాపైగల దయా దాక్షిణ్యాలు అటువంటివి. అలాగే ఆ సత్రవు ప్రారంభోత్సవంనాడు కూడా స్వామివారు, ఎముకలు కొరికే చలిలో, తెల్లవారు జామున 4 గంటలకు లేచి ఆ భవనంలో యజ్ఞయాగాదులు నిర్వహించారు.

1982లో ఆ స్వామివారు ఈ శృంగేరిలో ఒక ఆసుపత్రిని ప్రారంభించారు. నేను స్వామివారి దర్శనం చేసికొనడానికి ఇక్కడికి వచ్చాను. ''ఆదిశంకరులు స్థాపించిన ఈ పవిత్ర క్షేత్రానికి నేను కూడా నా చేతనైనంత సేవ చేయాలని అనుకుంటున్నాను'' అని స్వామివారికి విన్నవించుకున్నాను. అప్పుడు వారు ''నాయనా! ఈ ఆసుపత్రి నీదే!

నీకు తోచినది చేయి!'' అన్నారు. వెంటనే నేను ఒక X-Ray Machine కొని ఇవ్వడం జరిగింది.

ఈనాడు నేను, ఇక్కడ, ఈ శారదాదేవి సమక్షంలో, ఈనాటి స్వామివారి ముందూ, మీ ముందూ నిలబడి ఉన్నానంటే, దీనికి ఆ అభినవ విద్యాతీర్థస్వామి వారి పవిత్రమైన ఆశీస్సులే కారణమని నేను భావిస్తున్నాను.

## 3. శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ స్వామివారి ఆశీస్సులు:

### 3.1. పీఠాన్ని అధిరోహించడానికి ముందే చేసిన వాగ్దానం:

శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ స్వామివారు 1989లో శ్రీ శృంగేరీ శారదా పీఠాన్ని అధిరోహించడానికి వెళ్ళేముందు శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థస్వామివారి ఆలయం దగ్గర ఆగారు. అప్పుడు నేను వారి దర్శనం చేసుకున్నాను. వెంటనే నన్ను చూచి వారు ఇలా అన్నారు; ''మా గురువుగారు మీపైనా మీ కుటుంబంపైనా ఎంతో ఆదరాభిమానాలు, ప్రేమ, వాత్సల్యం చూపించేవారు. ఇక మీదట కూడా మీకు అదే విధమైన ఆశీస్సులు అందుతూనే ఉంటాయి!''. ఆ వాగ్దానం ప్రకారమే నడచుకుంటూ ఈ స్వామివారు నన్ను ఈనాటి వరకూ అనుగ్రహిస్తూ వస్తున్నారు. శ్రీవారి పాదార విందాలకు నా వినమ్ర ప్రణామాలు!

### 3.2 శ్రీ వేంకటేశ్వరుని మహిమ-స్వామివారి వ్యాఖ్యానం:

శ్రీ శ్రీ శ్రీ భారతీ తీర్థస్వామివారు ఒకప్పుడు భారతదేశ విజయయాత్రను పూర్తి చేసికొని, ఆఖరి మజిలీలో తిరుపతికి వచ్చారు. ఆ రోజు తిరుమలలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి అభిషేకం రోజు. నేను శ్రీ వేంకటేశ్వర స్వామివారికి వజ్రాలు పొదిగి చెక్కించిన కటిహస్తాన్ని బహూకరించాను. ఆ కటిహస్తాన్ని ఈ స్వామివారే తమ అమృతహస్తాలతో శ్రీ వేంకటేశ్వర స్వామికి అలంకరించారు. తరువాత తిరుపతి నుండి చిత్తూరుకు వచ్చి, మాగృహాన్ని పావనం చేశారు. అప్పుడు మా యింట్లో స్వామివారు చంద్రమౌళీశ్వర పూజ జరిపించి భక్తులందరినీ ఆనంద పరవశుల్ని చేశారు. ఆ సందర్భంలో జరిగిన ఒక అద్భుత సంఘటనను మీకు మనవి చేస్తున్నాను:-

మా యింట్లో ఎన్నో దేవుళ్ళ పటాలు ఉన్నాయి. అన్నింటికీ ఈ స్వామివారు పూలమాలలు వేశారు. పూజ అయిపోయిన మర్నాడు శృంగేరికి వెళ్ళిపోయారు. మా యింట్లో స్వామివారు వేంకటేశ్వరుని పటానికి వేసిన పూలమాల పెద్దదిగా పెరుగుతూ వచ్చింది. అందరం ఆశ్చర్యపోయాం. ఊళ్ళోని ప్రజలందరూ తండోపతండాలుగా వచ్చి ఆ వింతను చూడడం మొదలుపెట్టారు. నేను ఈ విషయం స్వామివారికి విన్నవిస్తే వారు ఇలా సెలవిచ్చారు: ''నేను శ్రీ వేంకటేవ్వర స్వామికి 'కటిహస్తం' తొడిగాను కదా! తన సంతోషాన్ని ఆస్వామి అలా వ్యక్తీకరించి ఉంటాడు'' అన్నారు. అది శ్రీ వేంకటేశ్వర స్వామి మాహాత్మ్యమేకాని తన మాహాత్మ్యం కాదన్నారు. కాని నా ఉద్దేశంలో ఈ విచిత్ర సంఘటనలో శ్రీ వేంకటేశ్వరస్వామి మాహాత్మ్యం ఎంత ఉందో ఈ భారతీతీర్థస్వామివారి మాహాత్మ్యం కూడా అంతే ఉంది!

### 3.3 అయోధ్య సమస్యను శాంతింప జేసిన స్వామివారు:

శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామివారు, 1992 నుండి భారతదేశాన్ని అట్టుడికినట్లు ఉడికించివేస్తున్న అయోధ్య సమస్యను శాంతింప జేసిన మహానుభావుడు! భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఉన్న శంకరపీఠాధిపతులందరినీ ఈ శృంగేరికి రప్పించి, ఇక్కడ ఒక పెద్ద సమావేశాన్ని ఏర్పాటు చేసి, అయోధ్య విషయంలో హిందువులు అల్లర్లు చేయడం సమంజసం కాదనీ, శాంతియుత విధానాలతో సమస్యను పరిష్కరించుకోవాలనీ హితవు చెప్పారు. ఆనాటి సమావేశానికి బదరి-ద్వారకల పీఠాధిపతి, పూరీ పీఠాధిపతి, కంచి పీఠాధిపతి హాజరయ్యారు. సర్వతంత్ర స్వతంత్రులైన ఆయా శంకర పీఠాధిపతులను ఈ శృంగేరీ పీఠానికి రప్పించడం మిక్కిలి అసాధ్యమైన విషయం. అటువంటి అసాధ్యాన్ని సాధ్యం చేసిన మహనీయులు ఈ శృంగేరీ స్వామివారు!

### 3.4 O. P. BLOCK:

శ్రీ స్వామివారు మా చిత్తూరు మీదుగా చేసిన ఒక విజయయాత్రలో శృంగేరిలోని ఆసుపత్రిలో **O. P. Block** నిర్మించమని నన్ను ఆదేశించారు. నేను సంతోషంతో అంగీకరించి, అప్పటి భారత ప్రధానమంత్రి అయిన శ్రీ పి.వి.

నరసింహారావుగారి చేత దానికి శంకుస్థాపన చేయించాను. తరువాత దానిని పూర్తిచేసి పీఠానికి సమర్పించాను. దానిని నా అదృష్టంగా భావిస్తున్నాను.

### 3.5 నిత్యాన్నదాన పథకం:

మరొక విజయయాత్రలో శ్రీ స్వామివారు యథాప్రకారం చిత్తూరులో మా ఆతిథ్యాన్ని స్వీకరించారు. అప్పుడు నా మనసులో తిరుమలలోని ''నిత్యాన్నదాన పథకం'' మెదిలింది. ''స్వామీ! శృంగేరిలో నిత్యాన్నదాన పథకం ఎందుకు ప్రవేశ పెట్టకూడదు?'' అని ప్రశ్నించాను. ''నాయనా! నీవే దానిని ప్రారంభించు'' అన్నారు స్వామివారు. కాని వెంటనే సందేహంతో ''భోజనం పెడతావు, సరే! మరి భోజనశాల ఎక్కడ?'' అన్నారు స్వామివారు. నేను మిక్కిలి సంతోషంతో ''భోజనశాలను కట్టించడానికి కూడా నేను సంసిద్ధుడనే!'' అన్నాను. స్వామివారు మిక్కిలి ఆనందించారు. నాకు అనుమతి ఇచ్చారు. నన్ను అనుగ్రహించారు.

ఈ భోజనశాల శంకుస్థాపన అప్పటి కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ హెచ్.డి. దేవేగౌడగారు నిర్వహించవలసి ఉంది. కాని వాతావరణం అనుకూలంగా లేకపోవడంతో ఆయన వచ్చిన హెలికాప్టర్ ఇక్కడ దిగడానికి సాధ్యంకాలేదు. అప్పుడు స్వామివారు దేవేగౌడగారి శ్రీమతి చేతా, ఇక్కడ చేరిన ఇతర భక్తుల చేతా శంకుస్థాపన కార్యక్రమం పూర్తి చేయించారు.

ఆనాటి శంకుస్థాపన, ఈనాడు, ఈ ప్రశాంత ప్రకృతి రామణీయక దృశ్యంలో, శ్రీ స్వామివారి దివ్య ఆశీస్సుల నేపథ్యంలో, జగన్మాత శ్రీ శాదరాదేవి కరుణా కటాక్ష వీక్షణాల కాంతులలో, ఈవిధంగా రూపుదాల్చింది!

ఈ భోజనశాల యావద్భారత దేశంలో మిక్కిలి పెద్దదియైన భోజనశాల. ఒకేసారి మూడువేలమంది భక్తులు కూర్చొని సుఖంగా భోజనం చేయవచ్చును. ఇక మీదట ఇక్కడ జగన్మాత శ్రీ శారదాదేవి శ్రీ కాశీ అన్నపూర్ణేశ్వరిగా మారి భక్తులకు షడ్రసోపేతమైన భోజనాన్ని వడ్డిస్తుంది! తన దివ్యహస్తాలతో అమృతాన్ని పంచి పెడుతుంది! అన్నార్తులైన భక్తుల ఆకలిని తీరుస్తుంది!

మనమంతా అన్నగత ప్రాణులం. ఆహారం లేకపోతే మన ప్రాణం ఒక్క క్షణం నిలవదు. అందువల్లనే అన్ని దానాలలోకీ శ్రేష్ఠమైనది అన్నదానం అని మన పెద్దలు చెప్పారు. అటువంటి అన్నదానాన్ని - నిత్యాన్నదానాన్ని చేసే సువర్ణావకాశాన్ని నాకు కల్పించి, ఈ భోజనశాల నిర్మాణాన్ని కూడా నాకే అప్పగించిన శ్రీ శ్రీ శ్రీ భారతీ తీర్థస్వామి వారికీ- ఈ సభకు విచ్చేసి, ఈ భోజనశాలను ప్రారంభించిన కర్ణాటక ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ ఎస్. ఎమ్. కృష్ణగారికీ -

ఇతర పెద్దలకూ -

సభాసదులకూ -

సమస్త భక్తజన కోటికీ -

ఎందరో మహానుభావులు - అందరికీ నా వందనాలు!!

-డి. కె. ఆదికేశవులు
**4-11-1999**

''వ్యక్తులు కానీ, దేశాలు కానీ, నిజమైన ప్రగతి సాధించాలంటే కావలసింది ప్రేమే. ప్రేమశక్తి ప్రపంచంలోని సమస్త సంబంధాలనూ మార్చివేయగలదు. సామాజిక, ఆర్థిక, కుటుంబ, మత, విద్యా, వృత్తిపరమైన, ఇతరత్రా సంబంధాలన్నీ, ఇప్పుడున్న స్థితి నుంచి ప్రేమశక్తితో మూలమట్టంగా మారిపోగలవు. మనుషులందరి లోనూ దైవికమైన అదే ప్రేమజ్వాల రగులుతున్నదనే స్పృహ వ్యక్తిగత మైన, సామాజికమైన ప్రవర్తనను సంస్కరించగలుగుతుంది. ఈ ప్రపంచమే ప్రేమమయమవుతుంది''.

-భగవాన్ శ్రీ సత్యసాయి బాబా

# కవితా! ఓ కవితా!

(ఇటీవల, అంటే 1997-1999 మధ్య కాలంలో వెలువడిన
కొన్ని నూతన కవితా సంపుటులు)

## పద్య కవితా సంపుటులు - కావ్యాలు:

1. **కుహేలిక** - డా॥ వి. వై. వి సోమయాజి, తెలుగు పండితుడు, జిల్లా పరిషత్ హైస్కూలు, తణుకు-534 211, పశ్చిమగోదావరి జిల్లా, వెల: రూ. 20/-

2. **జ్యోత్స్నాలహరి** - ఏలేశ్వరం మాధవాచార్యులు, అధ్యక్షులు, ఆంధ్ర పద్య కవితా సదస్సు, అదిలాబాద్ జిల్లా శాఖ, ఉట్నూరు - 504 311, అదిలాబాద్ జిల్లా, వెల: రూ. 20/-

3. **గురువందన శతకమ్** (శ్లోకాలు)- అత్తిలి వేంకట రమణ, శ్రీనివాస గ్రంథమాల, నూజివీడు - 521 201, కృష్ణాజిల్లా, వెల రూ. 10/-

4. **శ్రీరామ ద్విశతి** - లంకిపల్లి ఓబయ్య నాయుడు, 1-5-2, అమినేని వీథి, మదనపల్లె స్పిన్నింగు మిల్లు (పోస్టు), చిత్తూరు జిల్లా, వెల: రూ. 12/-

5. **స్వాతి జల్లులు**- బులుసు రామలింగేశ్వర శర్మ, సి - III, ఫెర్టిలైజర్ సిటీ - 505 210, కరీంనగర్ జిల్లా, వెల: రూ. 20/-

6. **సూక్తి సుధ** - కొర్లగుంట కృష్ణయ్య, 75, సరోజినీదేవి రోడ్డు, తిరుపతి - 517 501, వెల: రూ. 25/-

7. **కూచిమంచి తిమ్మకవి ప్రణీత నీలాసుందరీ పరిణయము** (అచ్చ తెలుగు కబ్బము-సుగంధి వ్యాఖ్య) - మొవ్వ వృషాద్రిపతి, ఉప్పాడి రోడ్డు, రేపల్లె-522 625, గుంటూరు జిల్లా, వెల: రూ. 150/- (పుటలు 24+626)

8. **దేవీ అశ్వధాటి** (కాళిదాస కృతి)- వ్యాఖ్యానం: డా॥ మేళ్ళచెర్వు భాను ప్రసాదరావు, రీడరు, తెలుగు విభాగం, ఎస్. ఎస్. ఎన్. కళాశాల, నరసరావు పేట - 522 601, గుంటూరు జిల్లా, వెల: రూ. 25/-

9. **ఆముక్త** - ప్రొ॥ కోవెల సంపత్కుమారాచార్య, 15-9-68, రామన్నపేట, వరంగల్లు - 506 002, వెల: రూ.25/-

10. **మదనపల్లె సాహితీ సౌరభాలు** (పద్యాలు, గేయాలు, వచన కవితలు) - **మదనపల్లె రచయితల సంఘం,** మదనపల్లె - 517 325, చిత్తూరు జిల్లా, వెల: రూ.20/-

11. **హృదయ పద్యం - జె. బాపురెడ్డి,** జుబిలీ పబ్లికేషన్స్, ప్లాట్‌నెం. 10, రోడ్డు నెం.5, జుబిలీ హిల్స్, హైదరాబాదు - 500 003, వెల: రూ. 20/-

12. **రసస్రువు-వేములవంశ గాథావళి** (చంపూ కావ్యము), - **ఆచార్య వి. యల్.యస్. భీమశంకరం,** 12-13-75, 4వ వీథి, తార్నాకా, హైదరాబాదు - 500 017, వెల: ప్రత్యేక ప్రతి-రూ. 300/-, సాదా ప్రతి-రూ. 200/-

13. **కదన విజయం** (కార్గిల్ కవితా సంహిత) (పద్యాలు, గేయాలు, వచన కవితలు) – **జాతీయ సాహిత్య పరిషత్,** 3-4-705/4, నారాయణ గూడ, హైదరాబాదు - 500 029, వెల: రూ. 50/-

14. **సాయి శరణాగతి** - ఎక్కలూరు కుమ్మర **బాలయ్య,** 12-462- ఎ-7-1, సాయినగర్, 6వ క్రాస్ రోడ్డు, అనంతపురం-515 001, వెల: రూ. 50/-

15. **విషాద మాధవి**- కరణం **బాలసుబ్రహ్మణ్యం పిళ్ళె,** 11-253-డి-5-ఎ, సొసైటి కాలనీ, మదనపల్లె - 517 325, వెల: రూ. 12/-

16. **జనరంజని** (పద్య కవితా ద్విశతి)-**మాల్యశ్రీ,** చింతూరి రమేష్‌బాబు, ప్రధాన కార్యదర్శి ''స్రష్ట'', 12-1-50, Opp. A.P.S.E.B., భద్రాచలం - 507 111, ఖమ్మం జిల్లా, వెల: రూ.20/-

17. **కవితా సంహిత - డా॥ నండూరి రామకృష్ణమాచార్య,** రాష్ట్రస్థాయి అధ్యక్షులు, ఆంధ్ర పద్య కవితా సదస్సు, 420 పి.జి. రోడ్డు, 35 జవహర్‌నగర్, సికింద్రాబాదు - 500 003, వెల: రూ. 75/-

18. **ముత్యాల గొడుగు** (వెల: రూ.100/-); **ఆలోచనము** (వెల: రూ.200/-)- **డా॥ నండూరి రామకృష్ణమాచార్య,**

19. **అగ్నివృక్షం** - **డా॥ అనుమాండ్ల భూమయ్య,** రీడరు, తెలుగుశాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి, వరంగల్లు - 560 009.

20. **కుమ్మరి గుండయ్య చరిత్ర** (మంజరీ ద్విపద) - **ఎక్కలూరు రమణమ్మ,** అనంతపురం, వెల: రూ. 10/-

21. **కవితా భారతి**- **ఏ.సి. దస్తగిరి,** 26/210, మునిసిపల్‌కాలనీ, ప్రొద్దుటూరు - 516 360, కడపజిల్లా, వెల: రూ. 10/-

22. **ఆరుద్ర శుద్ధ మధ్యాక్కరలు** - **స్త్రీ శక్తి ప్రచురణలు,** నెం.1, శివప్రకాశ ముదలి వీథి, టి-నగర్, చెన్నై - 600 017, వెల: రూ.50/-

23. **కవితా సౌరభాలు** - **డి. ఏ. ఎల్. ఎన్. మూర్తి,** 8-145/1, వసంతపురి కాలనీ, మల్కాజగిరి, హైదరాబాదు - 500 047, వెల: రూ. 30/-

24. **సూర్య రామాయణము-ద్వితీయభాగము** (అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండలు) - **వీరుభొట్ల సూర్యనారాయణ,** భాగ్యలక్ష్మి పేట, తాడేపల్లిగూడెం - 534 102, పశ్చిమగోదావరి జిల్లా, వెల: రూ.50/-

25. **నిర్వచన అధ్యాత్మ రామాయణము** (బాల, అయోధ్య, అరణ్య కాండలు)- **విద్వత్కవి ఆకుండి వెంకటశాస్త్రి;** ప్రతులకు: ఆకుండి రామశర్మ, ''సాహితి'', ప్లాట్‌నెం. 77, బ్యాంకర్స్ కాలనీ, దీపామహల్‌వెనుక, శ్రీకాకుళం - 532 001, వెల: రూ.100/-

26. **శ్రీ కృష్ణ కందమాల: శ్రీ శ్రితజనపోషా శతకము: శ్రీరామ శతకము; దీని చెప్పు బుడుత దివ్య చరిత; పాపరావు మాట పసిడి మూట; వేంకటేశ్వర శతకము** - ఈ కావ్యాలన్నీ వ్రాసిన కవి: **మీసాల పాపారావు,** ప్రధానోపాధ్యాయుడు, మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల, ముచ్చర్ల వలస, బూసాయి వలస (P.O.) - 535 579, రామభద్రపురం మండలం, విజయ నగరం జిల్లా.

27. **సువర్ణ సౌరభం** - **పువ్వాడ తిక్కన సోమయాజి,** పువ్వాడ ప్రచురణలు, నెం. 97, ఎల్. ఐ.సి. కాలనీ, విజయవాడ - 520 008, వెల: రూ. 30/-.

## వచన కవితా సంపుటులు:

1. **గంగడోలు– జూకంటి జగన్నాథం,** పుటలు - 150, ప్రతులకు - నయనం ప్రచురణలు, ఇంటి నెంబరు 10-2-65, సిరిసిల్ల (P.O.), కరీంనగర్ జిల్లా - 505 301, వెల: రూ. 50/-

2. **పాలకంకుల కల–వఝల శివకుమార్,** ప్రతులకు: వి. శారద. బి-24, P.O. ఫర్టిలైజర్ సిటి, కరీంనగర్ జిల్లా - 505 210, వెల: రూ. 40/-

3. **మౌనం మాట్లాడింది - డా॥ టి. రాధాకృష్ణమాచార్యులు ,** ప్రతులకు: స్వాతి పబ్లికేషన్స్, 4-6-14, ద్వారకానగర్, కరీంనగర్ - 505 001, వెల: రూ. 20/-

4. **పిడికిలి - కళ్యాణం శ్రీనివాస్,** ప్రతులకు: ఇంటి నెంబరు 8-3-119/10, శాంతి నగర్, కరీంనగర్ - 505 001, వెల రూ. 35/-

5. **భూగోళమంత మనిషిబొమ్మ -డా॥ సి. నారాయణరెడ్డి,** ప్రతులకు: ప్లాట్ నెం. 48, ఫిలింనగర్ కాలనీ, జూబిలీ హిల్స్, హైదరాబాద్ - 500 033, వెల: రూ. 50/-

6. **వేళ్ళు మాట్లాడే వేళ - దర్భశయనం శ్రీనివాసాచార్య,** పుటలు:92, వెల: రూ. 25/-, ప్రతులకు: రచయిత: ప్లాట్‌నెం. 15, విద్యారణ్యపురి, వరంగల్లు - 506 009.

7. **ముఖచిత్రం (దీర్ఘ కవిత) - వడ్డెబోయిన శ్రీనివాస్,** విరసం ప్రచురణ, పుటలు- 32, వెల: రూ. 10/-, ప్రతులకు: యం. రవీందర్, ఇంటినెంబర్: 1-137, భీమారం (IIస్టేజ్), హసన్‌పర్తి మండలం, వరంగల్లు జిల్లా - 506 015.

8. **మట్టిపువ్వు - యార్లగడ్డ రాఘవేంద్రరావు,** సాదాప్రతి :25/-; మేలు ప్రతి: రూ.40/-, ప్రతులకు: రచయిత, బి-22, మధురానగర్, హైదరాబాద్-500 038, (లేదా) విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాద్ - 1.

9. **దళిత దళం - హేమంత్ కుమార్ కె.కె.,** వెల: రూ. 20/-, ప్రతులకు: కె. కె. హేమ సురేఖ, ఇంటి నెంబరు: 2-1-4, అప్పర్ బజారు, సంగారెడ్డి - 502 001, మెదక్‌జిల్లా.

10. **దూదిపూల దుఃఖం** - ప్రజారస ప్రచురణ, పుటలు:48, వెల: రూ.15/-, ప్రతులకు: హనీఫ్, SPL.1243, పి.వి. కాలనీ, P.O. మణుగూర్, ఖమ్మం జిల్లా - 507 125.

11. **పంజరాన్ని నేనే, పక్షిని నేనే - శిలాలోలిత,** వెల: రూ. 15/-, ప్రతులకు: దిశ పుస్తక కేంద్రం: త్రినేత్ర సూపర్ మార్కెట్ ఎదురుగా, చిక్కడపల్లి, హైదరాబాద్-500 020.

12. **చెమట చెట్టు** - అనిశెట్టి రజిత, వెల: రూ. 30/-, ప్రతులకు: కవయిత్రి ఇంటినెంబరు:3-12-60, కుమార్‌పల్లి, వరంగల్లు-506 001, హన్మకొండ.

13. **అమ్మా నాకా బొమ్మ వద్దు - యం. పార్వతీ మోహన్**, పుటలు: 50, వెల: రూ. 15/-, ప్రతులకు: కవయిత్రి, ఇంటినెంబరు:16-2-738/4-H, ఆస్మాన్‌గడ్, మలక్‌పేట, హైదరాబాదు - 500 036.

14. **సూర్యుడ్ని అందుకోవాలని - శ్రీమతి చెళ్ళపిళ్ళ వెంకటరమణ,** వెల: రూ.20/-, ప్రతులకు: కవయిత్రి, ఫ్లాట్‌నెం.121/3, కళ్యాణ్‌నగర్(P.O.) సంజీవ రెడ్డినగర్, హైదరాబాద్-500 038.

15. **చిత్తరువు** - (దళిత కవిత్వం) వెల: రూ. 36/-, ప్రతులకు: ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్డు, విజయవాడ - 520 002, కృష్ణాజిల్లా.

16. **మండే గుండెలు -పెరికల యేసుదాసు,** వెల: రూ.12/-, ప్రతులకు: పి. ప్రకాశరావు (రిటైర్డ్ టీచర్), ఇందిరా నగర్ కాలనీ - చెంచుపేట, తెనాలి, గుంటూరు జిల్లా - 522 202.

17. **వెన్నెల గాచిన అడవి** - కర్రా కార్తికేయ శర్మ, పుటలు:64,వెల:రూ.25/-, చంద్రమౌళి ప్రచురణలు, వెలదుపేట, గోకవరం-533 286, తూ. గో. జిల్లా.

18. **ఆకలి శబ్దం** - వింజమూరి అచ్యుతరామయ్య, పుటలు: 32, వెల: రూ.20/-, ప్రతులకు: ఇంటి నెంబరు: 18-4-20, అయోధ్యరామపురం, క్లబ్ స్ట్రీట్, సామర్లకోట, తూర్పు గోదావరి జిల్లా - 533 440.

19. **వసంతాల వూసెత్తకు** - మంచికంటి వేంకటేశ్వర రెడ్డి, పుటలు:52, వెల: రూ. 25/-, ప్రతులకు: యం. అరుణకుమారి, C/o. బి. హన్మంతరెడ్డి, ఆమని, ఆర్.పి.రోడ్డు, ఒంగోలు - 523 001, ప్రకాశం జిల్లా.

20. **మనిషి** (దీర్ఘకవిత) - **తలతోటి పృథ్వీరాజ్**, పుటలు: 44, వెల: రూ.10/-, ప్రతులకు: టి. సత్యానంద్, సంజీవ నగర్, అద్దంకి, ప్రకాశం జిల్లా - 523 201.

21. **నీటి పాయల జలతారు** - **ఒబ్బిని**, పుటలు: 77, వెల: రూ. 25/-, ప్రతులకు: ఒబ్బిని పద్మావతి, ఫ్లాట్‌నెంబరు: 158, ఇంటినెంబరు: 5-2-64/70/A, మెడికల్ అండ్ హెల్త్ కాలనీ, వనస్థలిపురం, హైదరాబాదు - 70.

22. **రంగులూ-రాగాలు**- బి. నర్సింగరావు (సినీ దర్శకుడు), వెల: సాదా ప్రతి-రూ. 50/-, మేలుప్రతి-120/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, ఆబిడ్స్, హైదరాబాదు-500 001, అన్ని బ్రాంచిలు.

23. **కిటికీ కన్ను** , - శీలా వీర్రాజు (ద్వితీయ ముద్రణ), పుటలు: 56, వెల: సాదాప్రతి- రూ. 25/-, మేలుప్రతి-40/- ప్రతులకు: కవి, 2/C బ్రహ్మానంద నగర్, మలక్‌పేట్, హైదరాబాద్ - 500 036, (లేదా) దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020, (త్రినేత్ర సూపర్ మార్కెట్ ఎదురుగా)

24. **కొయ్యగుర్రం** (ద్వితీయ ముద్రణ) - **నగ్నముని**, వెల: రూ. 30/-, ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్-500 027.

25. **కలనేత** - **ప్రసాద మూర్తి**, వెల: రూ. 40/-, విశాలాంధ్ర బుక్ హౌస్, అబిడ్స్ - హైదరాబాదు - 500 001.

26. **చిగురు కలలు - దిలీప్,** వెల: రూ.20/-, ప్రతులకు: కె. ఇందిర, ఫ్లాట్ నెంబరు: 69, రోడ్డు నెంబరు:2, అలకాపురి, హైదరాబాద్ - 500 060.

27. **శంఖారావమ్- కుర్మాచలం శంకరస్వామి,** వెల: రూ. 25/-, ఇంటినెంబరు: 4-52-187, మగ్దూం నగర్, జగద్గిరి గుట్ట, హైదరాబాద్ - 500 037.

28. **జీవితం ఓ విజయం - సి. నారాయణరావు,** పుటలు: 67, వెల: రూ.25/-, ప్రతులకు: రచయిత, 8-445, పురిపాలెం, రంగనాయకుల పేట, నెల్లూరు - 524 001.

29. **పార్శ్వస్మృతి, - సి.యస్. ఎ. షరీఫ్,** వెల: రూ.10/-, ప్రతులకు: సి.యస్. సలీం బాషా, బి/సి-49, బి. క్యాంప్, కర్నూలు - 518 001.

30. **మట్టిస్పర్శ** - రంగు సత్యనారాయణ, వెల: రూ. 15/-, ప్రతులకు: శ్రీమతి శిరీష, 42-76/2 అంజయ్య నగర్, జగద్గిరిగుట్ట, హైదరాబాదు - 500 037.

31. **హృదయంలో హిరోషిమా- డా. ఆవంత్స సోమసుందర్,** వెల: రూ. 10/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

32. **జీవన లిపి - డా. ఆవంత్స సోముసుందర్,** వెల: 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

33. **బాపురెడ్డి భావగీతాలు -డా॥ జె. బాపురెడ్డి,** వెల: రూ. 60/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

34. **మీరేవుట్లూ? - మద్దూరి నగేష్ బాబు,** వెల: రూ. 25/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

35. **జల్‌జలా,**(ముస్లింవాద కవిత్వం) - సంపాదకుడు: **స్కైబాబు,** వెల: సాదా ప్రతి: రూ. 35/-, గ్రంథాలయ ప్రతి-రూ.75/-, ప్రతులకు: 'పుట్ట', పుస్తక శిబిరం, ఆలగడప, మిర్యాలగూడ, నల్లగొండ, తెలంగాణా.

36. **ఆగ్నేయాస్త్రమ్** - **ఆచార్య శ్రీధర,** వెల: రూ. 75/-, ప్రతులకు: శ్రీ మురళీ బ్రహ్మచారి, 9-2-580, వైదికు నగర్, జూలమ్మగుడి ఎదురుగా, సికింద్రాబాద్.

37. **నీలికేక- కత్తి పద్మారావు,** వెల: రూ. 30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

38. **గదిలో సముద్రం** (కవితలు, గజళ్ళు) - **డా॥ సి. నారాయణ రెడ్డి,** వెల: రూ.40/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

39. **నానీలు - డా॥ ఎన్. గోపి,** వెల: రూ. 50/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

40. **ఫత్వా – ఖాజా** - వెల: రూ.30/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

41. **దూది మేడ - నాళేశ్వరం శంకరం,** వెల: రూ.20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

42. **రాళ్ళలో రాగాలు - కనపర్తి రామచంద్రాచార్యులు,** వెల: రూ. 20/-, ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435 బ్యాంకు వీథి, హైదరాబాదు మరియు ఆంధ్రప్రదేశ్‌లోని ఇతర శాఖలు.

43. **మనోరాగం - ఆర్. రంగస్వామి గౌడ్,** వెల: రూ. 30/-, ప్రతులకు: శ్రీలేఖ సాహితి, 5-11-481, విద్యారణ్యపురి, హనుమకొండ, వరంగల్లు-506 009.

44. **శ్రీ సాయి సుధాలహరి** (పాటలు) - డా॥ వేదుల శ్రీరామశర్మ 'శిరీష', వెల: 7/-, ప్రతులకు: రచయిత, 66-5-20, అశోక్‌నగర్, కాకినాడ-533 003, తూర్పు గోదావరి జిల్లా.

45. **హైకూ సమయం** - శంకర, వెల: రూ. 10/-, ప్రతులకు: శంకర వెంకట నారాయణ, ఆచంట - 534 123, పశ్చిమ గోదావరి జిల్లా.

46. **బై క్యూ క్యూ- యస్. మునిసుందరం,** వెల: రూ. 15/-, ప్రతులకు: లక్ష్మీ సుందరం, 10-3-190 $A_2$, కోటకొమ్మల వీధి, తిరుపతి - 517 501.

47. **చీకటి దీపాలు, -యస్. మునిసుందరం,** వెల: రూ. 30/-, ప్రతులకు: లక్ష్మీ సుందరం, 10-3-190 $A_2$, కోటకొమ్మల వీధి, తిరుపతి - 517 501.

48. **ఆరుద్ర అరబ్బీ మురబ్బాలు** - వెల: రూ. 50/-, ప్రతులకు: కె. రామలక్ష్మి, 1, శివప్రకాశ్ ముదలి స్ట్రీట్, టి. నగర్, చెన్నై - 600 017.

49. **శ్వేత సంతకాలు** – సంకలనం - **పెరుగు రామకృష్ణ,** వెల: రూ. 25/-, ప్రతులకు: మణి బుక్ స్టాల్, సండే మార్కెట్, నెల్లూరు.

50. **కొత్త గబ్బిలం - ఎండ్లూరి సుధాకర్,** వెల: రూ.10/-, ప్రతులకు: మానస పబ్లికేషన్స్, 78-12-5, నెంబర్-3, గాంధీపురం, రాజమండ్రి-533 103, తూర్పు గోదావరి జిల్లా.

51. గోదావరి గొంతులు (గోదావరి జిల్లాల కవుల కవితా సంకలనం) - **సంపాదకులు: ఎండ్లూరి సుధాకర్, సన్నిధానం నరసింహ శర్మ, కె. యస్. వెస్లీ, వాసిరెడ్డి పద్మ;** వెల: రూ. 70/-. ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్ వారి అన్ని బ్రాంచీలు; నవోదయ బుక్ హౌస్, విజయవాడ, హైదరాబాదు.

52. **పద్య ప్రసూనాలు** (కవితా రసగుళికలు) - **ఆచార్య ఫణీంద్ర,** వెల: ఒక్కొక్కటి రూ. 20/-, ప్రతులకు: పూర్ణేందు సాహితీ సాంస్కృతిక సంస్థ, 20, అశ్వినీనగర్ కాలనీ, వెస్ట్‌మారెడుపల్లి, సికింద్రాబాదు-500 026.

53. **ప్రణయోత్సవం - డా॥ దాశరథుల బాలయ్య,** . వెల: రూ. 20/-, ప్రతులకు: రచయిత, 124-89/6, సరస్వతీనగర్, సిద్దిపేట - 502 103, మెదక్‌జిల్లా.

54. **హంసల దీవి - దీవి సుబ్బారావు,** ఫ్లాట్‌నెం. 143, వాసవి కాలనీ, దిల్‌సుఖ్ • నగర్, హైదరాబాదు - 500 035, వెల: రూ. 30/-

55. **అనంతం** (ద్వై మాసిక ఆధునిక సాహిత్య పత్రిక), విడిప్రతి రూ. 8/- సం॥ చందా రూ. 40/- ప్రతులకు: రాంషా - శిరీష పబ్లికేషన్స్, 40, ఇండస్ట్రియల్ ఎస్టేట్, సామర్లకోట - 533 440 తూర్పు గోదావరి జిల్లా.



## కవులకు మనవి

'చైతన్య కవిత' లో కవితా సంపుటులను కావ్యాలను సమీక్ష చేయడం కుదరటం లేదు. కాని కవితా సంపుటి వివరాలు మాత్రం ప్రచురించగలుగుతున్నాం. అందువల్ల కవులు తమ కవితా సంపుటులు లేదా కావ్యాలు ఒక్క ప్రతి పంపితే చాలు. రెండు ప్రతులు పంపవలసిన పనిలేదు. గద్య రచనలు మాత్రం పంపవద్దని మనవి. ఇది కవిత్వ పత్రిక అని గుర్తింపగలరు.

-సంపాదకుడు

# చైతన్య కవిత

## 1999లో చేరిన చందాదారులు

రాజపోషకులు:

శ్రీమతి భారతి - శ్రీ కలవచర్ల గోపాలకృష్ణమూర్తి దంపతులు, యశ్వంతపురం, బెంగుళూరు - 560 002.

పోషకులు:

కీ.శే. చల్లా పెదవెంకట రామలక్ష్మి , కీ.శే. చల్లా పాపయ్య శాస్త్రి దంపతుల జ్ఞాపకార్థం వారి కుమారుడు శ్రీ సి.వి.బి. కృష్ణమూర్తి, ఛీఫ్ ఎక్జిక్యూటివ్, కౌండిన్య ఇండస్ట్రియల్ సెక్యూరిటీ సర్వీసెస్, ఫ్లాట్ నెం. 810, ఢిఫెన్స్ కాలనీ, సికింద్రాబాదు - 500 094

జీవిత సభ్యులు:

1. **డా॥ ఎ. దత్తాత్రేయ శర్మ,** టి.జి.టి., తెలుగు, నవోదయ విద్యాలయం, పచపద్ర నగర్ - 344 032, బర్మార్ జిల్లా, రాజస్థాన్.
2. **శ్రీమతి పి. అరుణ,** ప్రిన్సిపాల్, యస్. కె. యస్. డి. మహిళాకళాశాల, తణుకు - 534 211, పశ్చిమగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.
3. **శ్రీ జి.యల్.యన్. మూర్తి,** విజయ బ్యాంక్, తణుకు - 534 211, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.
4. **శ్రీ కామకోటి ప్రసాదరావు,** సెక్రటరీ అండ్ కరస్పాండెంట్, జ్ఞానోదయ ఎడ్యుకేషనల్ అకాడెమీ, మదనపల్లె - 517 325, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.
5. **''సత్తిబాబు'' (శ్రీ కె.వి.వి. సత్యనారాయణ),** నెంబరు: 5-1-87, సీతయ్యగారి తోట, పిఠాపురం - 533 450, తూర్పుగోదావరి జిల్లా, A. P.

6. **''నిశాపతి'' (శ్రీ ఎం.హెచ్. వి. సుబ్బారావు),** సూపరింటెండింగ్ ఇంజనీరు - పంచాయితీరాజ్(రిటైర్డు), 114 గంగో్త్రి అపార్ట్‌మెంట్స్, హుడా కాంప్లెక్స్, సరూర్‌నగర్, హైదరాబాదు - 500 035, ఆంధ్రప్రదేశ్.

7. **డా॥ నడుపల్లి శ్రీరామరాజు,** రీడరు, తెలుగుశాఖ, యూనివర్శిటి ఆఫ్ హైదరాబాద్, సెంట్రల్ యూనివర్శిటీ, పి.ఓ., హైదరాబాద్ - 500 046, ఆంధ్రప్రదేశ్.

8. **డా॥ రావూరి భరద్వాజ** (భార్య కాంతమ్మగారి జ్ఞాపకార్థం), 159/2 ఆర్.టి. 'కాంతా నిలయం', విజయనగర్ కాలనీ, హైదరాబాదు - 500 057.

9. **శ్రీ సి.వి.యస్. ధన్,** 3/7 బ్రాడీపేట, గుంటూరు - 522 002, ఆంధ్ర ప్రదేశ్.

10. **డా॥ నోముల సత్యనారాయణ,** 6-4-66-ఇ-2, రవీంద్రనగర్, నల్లగొండ - 508 001, ఆంధ్ర ప్రదేశ్.

11. **శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు,** సంపాదకులు ''ప్రసారిక'', 6-7-61(న్యూ), రంగన్న దర్వాజా, హనుమకొండ - 506 001, వరంగల్లు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

12. **శ్రీ శేషట్ల్గా లక్ష్మీపతి శాస్త్రి,** 8A/83 W.E.A., Chana Market, Karol Bagh, New Delhi - 110 005.

13. **ది ప్రిన్స్‌పాల్,** హిందూ కాలేజి, గుంటూరు - 522 003, ఆంధ్ర ప్రదేశ్.

14. **శ్రీ కె. హరినాథ్,** ఎం.ఏ., డిప్యూటి కలెక్టర్ (ఫ్లైయింగ్‌స్క్వాడ్), రిజిస్ట్రేషన్ అండ్ స్టాంప్స్ డిపార్ట్‌మెంట్, కృష్ణనగర్, కర్నూలు - 518 002, ఆంధ్ర ప్రదేశ్.

15. **శ్రీమతి ఇందిర - శ్రీ సింగరాజు సచ్చిదానందం దంపతులు,** నెం. 43, ఆర్.యస్.గార్డెన్స్, తిరుపతి - 517 507, ఆంధ్ర ప్రదేశ్.

16. **డా॥ సుబ్బలక్ష్మి వర్ల్ల,** W/o Sri M.S. Murthy (DGM) (Trg), I.F.C.I. Tower, 61, Nehru Place, New Delhi - 110 019

# 'రేనాటి సూర్యచంద్రులు'

## ఉయ్యాలవాడ నారసింహారెడ్డి యుద్ధ వీరగాథ (1845-1847)

## బుడ్డా వేంగళరెడ్డి దాన వీరగాథానిక (1822-1900)

నేను ఒక లక్షా ఇరవైవేల రూపాయలు ఖర్చు చేసి 'రేనాటి సూర్యచంద్రులు' అనే అపూర్వ పరిశోధన గ్రంథాన్ని ప్రకటించాను. ఈ మహాయజ్ఞంలో నాకు సహకరించిన ఉత్తమ దాతల పేర్లన్నీ ఆగ్రంథం చివర ముద్రించాను. గ్రంథ ముద్రణ 15-8-1999 నాటికి పూర్తి అయింది. ఆ తరువాత కూడా కొందరు ఉదారులైన మహానుభావులు ఈ గ్రంథానికి ధనసహాయం చేశారు. కృతజ్ఞతలతో వారి పేర్లు ఈ దిగువ ఇస్తున్నాను. ఈ వివరాలు అనుబంధ గ్రంథానికి ఉపయోగిస్తాను. -తంగిరాల

1. ఆచార్య జి.వి.యస్.ఆర్. కృష్ణమూర్తి గారి సహాయం వల్ల "Madras School Book and Literature Society, Chennai" వారు - రూ. 2,500/-

2. శ్రీ భట్టు పుల్లయ్య, స్వాతంత్ర్య సమరయోధులు కోవెలకుంట్ల - 518 134, కర్నూలు జిల్లా, A. P. రూ. 1,116/-

3. డా॥ గెలివి సహదేవుడు, ఎం.ఎస్, గెలివి నర్సింగ్ హోమ్, 155/3, బైర్మల్ వీథి, నంద్యాల - 518 501, కర్నూలు జిల్లా, A. P. రూ. 1,000/-

4. శ్రీ చిలుకూరి కాశీవిశ్వేశ్వరరావు, 23/9-ఎ, సజ్జాపురం, తణుకు - 534 211, పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్. రూ. 1,000/-

5. శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి, ప్రతిభా జ్యూయల్రీ హౌస్, జి-1, సకలాజీ మార్కెట్, ఎవిన్యూ రోడ్డు, బెంగుళూరు - 560 002. రూ. 1,000/-

6. **శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి ('పఠాభి'),**
సెయింట్ మార్క్స్ రోడ్డు, బెంగుళూరు - 560 001 రూ. 1,000/-

7. **శ్రీ జె. ఎ. కరీం సాహెబ్,** బి.టెక్.
అసిస్టెంటు ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, S/o. శ్రీ కమాల్ సాహెబ్,
ఉయ్యాలవాడ - 518 155, కర్నూలు జిల్లా, A. P. రూ. 500/-

8. **డా॥ ఆర్. శివారెడ్డి,** అధ్యక్షులు, ''కళాకుముద్వతి'',
కోవెలకుంట్ల - 518 134, కర్నూలు జిల్లా, A. P. రూ. 500/-

9. **శ్రీ హృషీకేశవ రెడ్డి,** కాంగ్రెసు నాయకులు,
జమ్మలమడుగు - 516 464, కడప జిల్లా, A. P. రూ. 505/-

10. **డా॥ భూపతిరాజు రమేష్ చంద్రబాబు,**
ప్రగతి నర్సింగ్‌హోమ్, నన్నయ విగ్రహం దగ్గర,
తణుకు - 534 211, పశ్చిమ గోదావరి జిల్లా. రూ. 500/-

11. **శ్రీ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణ,** ఆడిటర్
పాలకొల్లు - 534 260, ప. గో. జిల్లా, A. P. రూ. 500/-

12. **డా॥ చన్నాప్రగడ జయలక్ష్మి,** తెలుగు రీడరు,
బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు - 56. రూ. 500/-

13. **శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్‌గిర్ – డా॥ గుంటూరు శేషేంద్రశర్మ**
దంపతులు, జ్ఞానబాగ్ ప్యాలేస్, హైదరాబాద్ - 500 012. రూ. 500/-

14. **శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డి,** రెడ్డి అండ్ కో, ఆడిటర్
ఆర్.వి. రోడ్డు, బెంగుళూరు - 560 004. రూ. 500/-

15. **శ్రీమతి లకంసాని విజయలక్ష్మి –**
**శ్రీ లకంసాని శ్రీరామకృష్ణ** దంపతులు,
పాతవూరు, తణుకు - 534 211,
పశ్చిమగోదావరి జిల్లా. A. P రూ. 500/-

16. **శ్రీ బి. నారాయణ రెడ్డి,**
ఫారెస్ట్ ఆఫీసర్, గిద్దలూరు - 523 357,
ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్. రూ. 500/-

17. **డా॥ వి. వై. వి. సోమయాజి,**
తెలుగు పండితుడు, జిల్లా పరిషత్ హైస్కూలు,
తణుకు - 534 211, పశ్చిమ గోదావరి జిల్లా, A.P. రూ. 500/-

18. **'శివకవి' శ్రీ ఎన్. శివనగౌడ్,**
పి.ఎన్.రోడ్డు, సాయిబాబానగర్, ఆదోని - 518
కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్. రూ. 500/-

19. **శ్రీమతి పద్మా ఆర్.రావు ('నిరుపమ')-**
**శ్రీ టి.కె. రామచంద్రరావు దంపతులు,**
248 హోస్పహాస్, సంపిగె రోడ్డు, మల్లేశ్వరం,
బెంగుళూరు - 560 003. రూ. 500/-

20. **డా. పాణ్యం శ్రీనివాస గురుమూర్తి,**
నెం. 11/27, వెల్దుర్తి (కర్నూలు) - 518 216,
కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్. రూ. 500/-

21. **Sri A. Bhaskara Reddy,** Advisor (Corporate Affairs),
Seshasayi Paper and Board Limited,
84, T.T.K. Road, CHENNAI - 600 018 రూ. 500/-

22. **శ్రీమతి అంబికా అనంత్ -**
**శ్రీ పి. యస్.వి. అనంత నారాయణ దంపతులు,**
నెం. 22, 13వ క్రాసు, మార్గోసా రోడ్డు,
మల్లేశ్వరం, బెంగుళూరు - 560 003 రూ. 500/-

# కవితా లేఖ

(నేను రచించిన ''రేనాటి సూర్య చంద్రులు'' గ్రంథాన్ని చదివి శ్రీ పొన్నారి దస్తగిరి అనే కవి జమ్మలమడుగు నుండి ఈ క్రింది విధంగా లేఖ వ్రాశారు: - తంగిరాల)

ఆ.వె. తంగిరాల వంశ తనయుండ, శ్రీ సుబ్బ
రావుగారు, మీ వరాల మాట
గ్రంథ రూపముననుగంటి, సద్బ్రాహ్మణా!
శుభము లందుకొమ్ము సౌఖ్యమబ్బు.

చ. చదివితి నెల్ల గ్రంథమును సారమ పారముగా గ్రహించితిన్
విదితము నయ్యె, నీ చరిత విశ్వ ప్రమోదము లోకపూజితం,
సదమల వృత్తిచే తిరుగు సద్గుణ భావ విశేషవర్తనన్,
ముదమయె, పుణ్యమూర్తిగను మ్రొక్కి నుతింతును భూసురాగ్రణీ!

కం. రేనాటి సూర్యచంద్రులు
ఆ నా డెటువంటి వారొ యది తెలియదుగా,
ఈనాడు నీదు గ్రంథము
కన్నుల కన్పింప జేసె ఘనముగ వారిన్.

కం. పద్యము గద్యము రెండున్
హృద్యముగా వ్రాయగల మహోన్నత పురుషా!
విద్యల జానపదపు నై
వేద్యము బెట్టిన ఘనత, ప్రవీణత నీదే!

శా. వందే సర్వగుణాత్మకం, బుధవరం, వందే మహాభూసురం
వందే వేంకటసుబ్బరాయ మనుజం, వందే సదాపూజితం
వందే నిత్య ప్రభావ భావ కవితం, వందే సుధా బాషితం,
వందే శాంత స్వరూప స్వార్థ రహితం, వందే సదా శ్రీవరం!

మీ సేవలో
పొన్నారి.

# 'దాతా భవతి వా నవా'

కొన్ని వందలమందిలో ఒక శూరుడు ఉంటాడు: కొన్నివేల మందిలో ఒక పండితుడు ఉంటాడు. కొన్ని లక్షలమందిలో ఒక వక్త (చక్కగా ఉపన్యసించ గలిగిన వాడు) ఉంటాడు. అయితే ఆ కొన్ని లక్షలమందిలో ఒక దాత (దానగుణం కలిగినవాడు) ఉంటాడో ఉండడో చెప్పలేం - అన్నారు మన పెద్దలు.

నేను 'విప్లవజ్యోతి' అల్లూరి సీతారామరాజుగారి జీవిత చరిత్రను రెండువేల పద్యాలలో 12 ఆశ్వాసాలుగా - నా మిత్రుడు డా॥ మల్లెల గురువయ్య చేత వ్రాయించాను. 1997 జూలై 4వ తేదీని సీతారామరాజుగారి శతజయంతి సందర్భంగా 40వేల రూపాయలు ఖర్చు చేసి ఈ కావ్యాన్ని ముద్రించాను. ఈ గ్రంథముద్రణకు పూర్వం కొంతమంది ధన సహాయం చేశారు. వారిపేర్లు ఆ పుస్తకంలో ప్రకటించాను. అయితే గ్రంథ ముద్రణ పూర్తి అయిన తరువాత కూడా కొందరు ఉదారులైన దాతలు - ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ క్షత్రియ సేవాసమితి కార్యవర్గ సభ్యులైనవారు - నాకు విరాళాలు పంపారు. వారి పేర్లు ఈ దిగువ ఇస్తున్నాను:-

1. **శ్రీ డి. వి. రాజు**
అధ్యక్షులు, క్షత్రియ సేవా సమితి
2-1-284, నల్లకుంట,
హైదరాబాదు - 500 044 — **రూ. 5000/-**

2. **Sri V. S. Raju**
Chairman & M.D.
Western Bio-Systems Ltd.
65/1-A, "Eco House"
Karve Road, Pune - 411 004 — **రూ. 1116/-**

3. **శ్రీ డి.వి.యస్. రాజు,**
ఛైర్మన్, ఎలికో మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్
311, మోడల్ హౌస్,
6-3-456/A/1, పంజాగుట్ట,
హైదరాబాదు - 500 082 — **రూ. 1008/-**

4. **శ్రీ ఉద్దరాజు రామకృష్ణరాజు,**
ఫ్లాట్ నెం. 67, 102 సునయన అపార్ట్‌మెంట్స్,
కల్యాణనగర్, (సెంట్రల్ బ్యాంకు దగ్గర),
హైదరాబాదు - 500 038 **రూ. 1000/-**

5. **శ్రీ కలిదిండి రామచంద్రరాజు**
మేనేజింగ్ డైరెక్టర్, ఎస్.సి.ఎల్. ఇండస్ట్రీస్ లిమిటెడ్
రాఘవ రత్న టవర్స్
ఏడవ అంతస్తు, చిరగ్ ఆలీ లేన్,
అబిడ్స్, హైదరాబాదు - 500 001 **రూ. 1000/-**

6. **శ్రీ బైర్రాజు సత్యనారాయణరాజు**
1-8-303/48/30, సెకెండ్ ఫ్లోర్,
సింధి కాలనీ, పి. జి. రోడ్డు,
ఎస్. పి. రోడ్డు, సికింద్రాబాదు - 500 003 **రూ. 1000/-**

7. The Managing Director
Diagram Group of Industries
Road No. 5, I. D. A.
Nacharam, Hyderabad - 500 076 **రూ. 525/-**

8. **డా॥ జి. సోమరాజు,** B.sc., M.B.B.S.
అన్నపూర్ణ నర్సింగ్ హోమ్
తణుకు - 534 211, పశ్చిమ గోదావరి జిల్లా **రూ. 500/-**

పైన తెల్పిన వదాన్యులందరికీ నేను మిక్కిలి ఋణపడి ఉన్నాను. అందరికీ నా వినయపూర్వక వందనాలు.

బెంగుళూరు — **ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు.**
7-11-1999 నెం. 40/12-7, ''సౌరభ'', 22వ క్రాసు,
దీపావళి గోవిందరాజనగర, విజయనగర, బెంగుళూరు - 560 040

# శ్రీరస

## శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

### బెంగుళూరు

| | |
|---|---|
| గౌరవాధ్యక్షులు : | శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు<br>శ్రీ బుల్లా సుబ్బారావు ఐ.ఎ.ఎస్<br>డా॥ పద్మా ఆర్. రావు ('నిరుపమ') |
| అధ్యక్షులు : | ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు |
| ఉపాధ్యక్షులు : | శ్రీ చిలకల వెంకటసుబ్బారెడ్డి<br>శ్రీ పెద్ది సత్యనారాయణ |
| కార్యదర్శి : | డా॥ దివాకర్ల రాజేశ్వరి |
| కోశాధికారి : | శ్రీమతి అంబికా అనంత్ |
| కార్యనిర్వాహక సభ్యులు : | శ్రీమతి ఆచంట కమలకుమారి<br>శ్రీమతి మారుతీ శ్రీలత<br>శ్రీ మార్కండపురం శ్రీనివాస<br>శ్రీ పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం<br>శ్రీ న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)<br>డా॥ విజయా సుబ్బరాజు<br>శ్రీ మొగలి ఎస్. రామస్వామిరెడ్డి<br>శ్రీ నండూరి భాస్కర్ (అశ్విని)<br>శ్రీ దర్శి లక్ష్మీ వేంకటేశ్వర వరప్రసాదరావు |
| ప్రధాన పోషకులు : | శ్రీ పి.యస్.వి. అనంత నారాయణ |

# చైతన్య కవితా వేదిక

నెం. 40/12-7, 'సౌరభ' (మేడపైన), 22వ క్రాసు,
గోవిందరాజ నగర, విజయ నగర, బెంగుళూరు - 560 040

గౌరవాధ్యక్షులు : శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి)
డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ (శేషేంద్ర)
శ్రీ ఏరాసు అయ్యపురెడ్డి

అధ్యక్షులు –
మహారాజ పోషకులు : శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు

ఉపాధ్యక్షులు : శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.ఎస్.
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి
శ్రీ కె.పి. రావు
శ్రీ వై. వి. వెంకటేశ్వరరావు
డా॥ జె. బాపురెడ్డి, ఐ. ఎ. ఎస్. (రిటైర్డు)
డా॥ శ్రీపాద కృష్ణమూర్తి

కార్యదర్శి : ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

సహకార్యదర్శులు : డా॥ దివాకర్ల రాజేశ్వరి
శ్రీమతి అంబికా అనంత్
శ్రీ న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)
డా॥ ఎం. రుక్మాంగద నాయుడు
శ్రీ వి. రామనరసింహారెడ్డి
డా॥ పి. యు. బి. శర్మ
డా॥ కె. చంద్రప్ప

కోశాధికారి : శ్రీ తంగిరాల శ్రీనాథ కవిసార్వభౌమ



ప్రముఖ కవి

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

సిద్ధిపేట, మెదక్ జిల్లా.

# చైతన్యకవిత

ప్రమాథి శరత్తు – **October 1999**




చైతన్య కవితా వేదిక. బెంగుళూరు